expedite the location of the Land Mortgage Co-operative Bank at Rayadrug, Kalyanadrug being included in its jurisdiction.

Secondly, I came to another important question; that is the people of weavers' co-operative society. I have already drawn the attention of the House that the weavers of Rayadrug are undergoing great suffering and no relief is given to them inspite of agitation.

Rayadrug is a weavers' centre. It has a population of nearly 10 thousands. There are a large number of loomes there, and the weavers Co-operative society has to purchase from Anantapur, a place which is 107 miles from Rayadrug. Needless to say, how difficult it is for the people of Rayadrug to go to Anantapur to purchase yarn etc., Therefore we have submitted petitions memorandams and similar things to the concerned authorities to open an emporium for sale of yarn and hand loom products at Rayadrug for the benefit of the weavers of Rayadrug. Even this humble request has not been granted even to this day, with the result the weavers are undergoing great hardships and in course of time they may become a danger for the well being of the society.

Thirdly, after the grant of 20 lakhs of rupees which was allotted for the relief of weavers by Government, this sum has not seen the light of the day, and the Rayadrug weavers' co-operative society has not been functioning at all since the accumutation has not been cleared. There is therefore large accumutation of stocks, and day to day that quantity is increasing and a sa result there is growing unemployment also. So long as accumulation of stock is allowed to go on and it remains unsold, there can be no employment and functioning of the society. Even to this day, though I have drawn the attention of the District Registrar to it, the stock has not been cleared. The executive order of the Registrar seems very strange and amusing. I am told he has

Sri G. Nagabhushanam] [19th March 1954

not given order for the investment of monces granted for the purchase of finished goods and disposal of stocks It is strange how this has happend, even though the non-credit side of the Co-oparative Department in Andhra has been functioning well. I would therefore, request Government to take immediate steps in the matter. There are three co-operative societies of the weavers in my taluk. They are at Hirala, Vithal and Rayadrug. These weavers' societies are to-day not atall functioning. They have been closed as they have no capital to provide yarn to the weavers. They are begging in the streets for works So, I request the Hon. Minister to take immediate steps to clear off the accumulated stock of goods, distribute yarn and afford employment to weavers.

Lastly, a word about co-operative movement in forign countries. The cooperative movement in foreign countries has renderd yeoman service. The co-operative movement is a success in Andhra State so for it has opend a Co-operative Spinning Mill to supply yarn to weavers. Secondly the Yemmiganur Co-operative Society at Yemmiganur is a great success and affords as an ideal for other weavers' co-operative societies in the State. But in spite of all this, the progress of the movement is not very encouraging in village side or even in taluks for, the staff that is employed in the Co-operative Department, in my humble opinion, lack zeal and enthusiasm and necessary technical equipment. This zeal and enthusiasm is essental for all Government servants in a welfare State to work hard to active the ideal. In my humble opinion the present staff in the Co-operative Department as well as in other Departments of the State lack this zeal and enthusiasm. The reason is not far to seek. They have all been trained under British when was a Police State rather a welfare State. In a welfare State the officials em-

ployed have to change their hearts and carry out the ideals of a welfare State. I therefore request the Hon. Minister to infuse enthusiasm and zeal in Government officials with a view to realise the aims of a welfare State, failing which the progress of the State is bount to beslcw. As matter stand, in Anantapur district the work is very. very slow and the official of the co-operative department are not taking any interest for the promotion of co-operation.

In Rayadrug taluk, there are a large number of independent weavers carrying on handloom industry, partly of silk and partly of yarn. They also use lace for embroidery and artistic work. Most of these weavers are not included within the co-operative fold. I would suggest amending the Co-operative Societies Act spuitably so as to include these weavers who are carying on silk and yarn industry in Rayadrug, in the co-operative fold. So far. the co-operative movement has not touched this aspect of the question and the indifferent attitude of Government officials in the Co-oparative Department is responsible for this slackness. No doubt our Ministers are really very enthusiastic and patriotic. But, what matters is, as once Sri Rajagopalaichariar said, unless the administrative officials are really imbued with patriotism, this work cannot be carried on. With these few remarks, I conclude. Tank you, Sir.

*Sri K. SUBBA REDDI:— అధ్యక్షా! ఈ సహకార వుద్యమం గురించి చెప్పాలంటే, చాలా విషయాలు వున్నవి. ముఖ్యంగా మా గుంటూరుజిల్లాలో, మా జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకు క్రెడిట్ సొసైటీలలో అక్కడ ప్రజలకు చేస్తున్న ప్రజాతంత్ర విరుద్ధ చర్యలను గురించి, ఇదివరకు ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోనూ, యిక్కడ ఆంధ్ర రాష్ట్రములోనూ కూడా మన మంత్రిగారితో అనేకసార్లు

Sri K. Subba Reddi] [19th March 1954

విన్నవించుకోవడం జరిగింది. కాని దాని విషయంలో ఏమి చర్య తీసుకొన్నారో తెలియదు. అక్కడ సహకార ఉద్యమంలో యేరకమైన మార్పులు రాలేదని నేను మనవి చేస్తున్నాను. ముఖ్యంగా యీ సొసైటీలు ప్రజాతంత్ర పద్ధతులలో నడవటం లేదు. ఇప్పటికే గుంటూరు జిల్లాలో కోఆపరేటివు బ్యాంకు అట్టి పరిస్థితులలోనే మరీ అధ్వాన్నంగానే వున్నదని నేను వేరే చెప్పవసరములేదు. వారు వారికి యిష్టము వచ్చిన వారికి, అనుచరులకు, ఆ బ్యాంకునుండి యెన్నో లక్షల రూపాయలు బినామీలో న్నుగా యివ్వటం జరిగింది. అంతే కాకుండా ముఖ్యంగా పల్నాడు తాలూకాలో బినామీలోన్సు 7,50,000 రూపాయలు వున్నవి. అదే విధంగా అవి వసూలు కాకుండా వున్నవి. ప్రజలకు అసలు అప్పులువున్నవో లేదో తెలియదు. ఎవ్వరో కొందరు తీసుకొన్నారంటే అవి యెవరు తీసుకొన్నారో తెలియదు. ఈ విషయంలో నాకు చాలా reportలు వచ్చినవి. వారిమీద decree అయినా వున్నాయో లేవో తెలియదు. అవి ప్రభుత్వానికి, ప్రజలకు నష్టం కలిగించే పదతిలోనే వున్నాయని నేను చెబుతున్నాను.

కొన్ని పాల కో-ఆపరేటివు సొసైటీలు వున్నాయి. వాటిలో పాలులేవు. సరఫరాలేదు. ఆవులులేవు, గేదెలులేవు, పాత్రలులేవు, యేమీలేవు. ఆ సొసైటీలలో డబ్బుపెట్టడం మాత్రం జరుగుతున్నది. పల్నాడు తాలూకాలో, పిడుగురాళ్ళలో "మార్కెటింగు ఫెడరేషన్" అని ఒకటి పెట్టారు. అక్కడ గింజలు వ్యాపారం చేస్తున్నామని ఆ federation వారుచెప్తూ వుంటారు. అందులో 30 వేల రూపాయలు డబ్బు insure చేశారు. అక్కడగింజలులేవు కాని officers వస్తేమాత్రం పాతగాదెలను, పైన క్రొత్తగా మట్టిపూసి, చూపిస్తారు. అసలు నిజంగా ఆ గాదెలో మట్టిమాత్రమే వుంటుంది. కావలసివస్తే, యిప్పుడు వెళ్ళి చూడండి, నిజం బయటపడుతుంది. ఆ విధంగా బ్యాంకుల, సొసైటీల పెత్తనదార్లు ప్రజల కళ్ళకు గంతలుకట్టి పెద్దపెద్ద మేడలు, మిద్దెలు కట్టించుకొంటున్నారు. తుమ్మలపల్లిచెర్వు credit society లో లక్ష యేబది వేల రూపాయలు నాలుగు సంవత్సరములనుండి వసూలు కాకుండా వున్నది. అందుకని ఒక Senior

Inspector ను వేశారు. అయినా అది వసూలు కాలేదు. ఒక పల్నాడు తాలూకాలోనే రు 7,50,000 లు వసూలు కాలేదు. ఎవ రయితే దానికి బాధ్యులో వారిపై యేమి చర్య తీసుకొన్నారని నేను అడుగుతున్నాను. ఈ సొసైటీల పేరుతో యెంతమంది పెద్దమనుష్యులు యేయే రూపంలో యీ విధంగా పనిచేస్తున్నారో నేను చెబుతున్నాను. ఈ విషయంలో ప్రభుత్వం యేమి చర్య తీసుకోవటంలేదు.

శ్రీ గోగినేని లక్ష్మీనారాయణగారు Guntur Mar e.i g Federation అని ఒకటి పెట్టారు. అది దివాలా ఎత్తింది దానికింద రు 36,00,000 లు నష్టంవచ్చింది. ఈ విషయములో ప్రభుత్వం యేమి చర్య తీసుకొన్నదని నేను అడుగుతున్నాను.

ఇదివరలో శాసనసభ్యులుగావున్న శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారి మేనమామ గుంటూరు సేల్సు సొసైటీ అని ఒకటి పెట్టారు. అందులో దాదాపు 20వేల రూపాయలు నష్టంవచ్చింది. దీని విషయంలో కూడా ప్రభుత్వం ఏమిచర్య తీసుకొన్నది?

నిన్నటిచర్చలో Mohan Industries అని వచ్చింది, ఆపెద్దమనిషి Guntur Co-operative Bank అధ్యక్షుడు loans యిచ్చి బ్యాంకు ను దివాలాతీయించే స్థితికి తెచ్చారు. వారు వారికి సంబంధించినవారికే గ్రామాలలో చిన్న ముఠాదారులనుపెట్టి, వారు అధికారం చలాయించ డం కోసమని, వారిపొట్టలు నింపుకోవటం కోసమని, ఈ పనులన్నీ చేస్తున్నారు. వారికి సంబంధించిన పెద్దలే యిప్పుడు contractors గా చేస్తున్నారు. వారు అనేక credit societiesకు ప్రెసిడెంటుగా వున్నారు. వారికి స్వంత ఆస్తులులేవు. అవి వారి భార్యలపేర పెట్టుకుంటున్నారు. వారు ఈ విధంగా ప్రజలను, ప్రభుత్వమును మోసము చేస్తున్నారు. అందుచేత, తక్షణం ప్రభుత్వం Guntur Co-operative Bank మీాద లెఖ్కలు తనిఖీ చేయడానికి ప్రభుత్వోద్యోగిని నియమించాలని నేను ప్రభుత్వమును కోరుతున్నాను. రెండవది, యీ గుంటూరుజిల్లా కోఆప రేటివు బ్యాంకుపరిస్థితి ఏమిటి? ఎక్కడైనా, ఎవరైనా credit societyని ప్రారంభిస్తే ఇతరులెవ్వరైనా credit society ని ప్రారంభము చేయ దల్చుకొంటే, వారు రయితులకు యేక్కడ సేవచేసిపోతారో అని చెప్పి, యీ

society కి అప్పులు యివ్వని కారణంచేత ఇంతవరకు అనేక societies register కాబడలేదు. అలాంటి సొసైటీలు ముఖ్యంగా నరసరావుపేట తాలూకాలో వున్నవి. ఇష్టంవచ్చినట్లు సొసైటీలు వారిపేరుతో యేర్పాటు జరుగుతున్నవి. వాటిలో అప్పులు వారిలో వారికి ఇవ్వటం జరుగుతున్నది. ఈ విషయం ప్రభుత్వానికి నేను ఎన్నో పర్యాయాలు చెప్పినా, ప్రభుత్వం గమనించటంలేదు. వారు యిక్కడ గౌరవసభ్యులు అవటంవల్ల ప్రభుత్వం చర్య తీసుకోవటంలేదు. ఈలాగే శ్రీ సంజీవరెడ్డి గారి కాళహస్తి ఎన్నికలలో ఈ bank అధ్యక్షుడు దాదాపు 20,000 రూపాయలు ఖర్చు పెట్టినట్లు వినికిడి. నేను పై విషయాలను వున్నది మద్రాసు రాష్ట్రంలోనూ, ఆంధ్రరాష్ట్రంలోనూ విచారణ చేయాలని అడిగివున్నాను. అందుచేత, దానికి ప్రభుత్వంవారే సంజాయిషీ చెప్పాలని అడుగుతున్నాను.

(At this stage, Sri G. Nagabhushanam occupied the Chair.)

రెండవ విషయం, అక్కడక్కడ కొంతడబ్బును ప్రెసిడెంట్లకు జమ కట్టారు. ఆవిధంగా జమకట్టినడబ్బు ఇంతవరకు ఏబ్యాంకులలోకి చేరలేదు. ధర్మవరం సొసైటీలో ఆరువేల రూపాయలవరకు వసూలుఅయినా, ఇంతవరకు దానిని యే Central Bank లోను జమకట్టలేదు. అదేవిధంగా గుళ్ళపాడు, గొట్టిబండ, కోళ్ళపాడు మొదలయిన సొసైటీలలో వసూలైన మొత్తాలుకూడా జమకట్టబడలేదు. ఇలాంటివి కొన్ని మా పల్నాడు తాలూకాలో 105 సొసైటీలు వున్నవి. అసలు ఇన్ని సొసైటీలు భారతదేశంలో వున్నాయా? అని అడుగుతున్నాను. ఈ రోజున పాలకు సహకార సొసైటి, రైతుల సొసైటి ఒకటి, పొలిటికల్ సొసైటీలే ఇవన్నీ. తేనిటి సొసయిటి ఒకటి, ఇవన్నీకూడా ప్రజల నెత్తిన టోపీపెట్టటానికే ఇటువంటి సొసయిటీల list నా దగ్గర వుంది. ఇలాగున ఒక్కొక్కరు ఒక్కొక్క సొసయిటి గ్రామ గ్రామన్నా రాష్ట్రంలో కొంతమంది వ్యక్తులు manage చేసినవి వున్నాయి. జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంట్లు, తాలూకా కాంగ్రెసు ప్రెసిడెంట్లు, పట్టణ కాంగ్రెసు ప్రెసి

డెంట్లు వీరిచేతుల్లోవున్నాయి. అందుచేత, ఈ Co-operative Bank మీాద ఒక Special Officer ను వేసి, విచారణ చేయించవలసినదని నేను కోరుతున్నాను.

నేను దీని విషయంలో కొన్ని applications పెట్టాను. విచారణకు పెట్టారు. కొన్ని instances తీసుకొని రైతులందరు గోలపెడుతున్నారు. నేను ప్రభుత్వ దృష్టికి తీసుకొస్తే, ఎవరో ఒక ఆఫీసరువచ్చి నన్నుగాని, ఆ రైతులనుగాని, కలుసుకోకుండా అన్నీ సక్రమంగా వున్నాయని చెప్పి, వేలు ముద్రలు, కాలిముద్రలు వేసుకొని వ్రాశాడు. దీనికి ఆ ఆఫీసరు బాధ్యుడా? లేక ఆ కో-ఆపరేటివ్ ప్రెసిడెంటు బాధ్యుడా? ఈ రూపంలో విచారణ జరుగుతున్నది. కాబట్టి వెంటనే ప్రభుత్వం ఒక స్పెషల్ ఆఫీసరును వేసి గుంటూరుజిల్లా కో ఆపరేటివు సెంట్రల్ బ్యాంకు వ్యవహారాలను పరిశీలించాలని కోరుతున్నాను. ఈమధ్య ఇంకోవిషయం జరిగింది గుంటూరుజిల్లా కాంగ్రెసువారి నుండి ఒక కారును కో ఆపరేటివు బ్యాంకువాళ్ళు 12 వేల రూపాయలకు కొన్నారు. ఆ కారుకు రిపేరు నిమిత్తం 20 వేల రూపాయలు ఖర్చు అయిందని చెప్పారు. అది తిరిగి 2 వేల రూపాయలకు అమ్మేశారు. మళ్ళీ కొంత డబ్బుపెట్టి ఇంకొక కారు కొన్నారు. ఈ రూపంలో అనేక విధాలుగా వ్యవహారకాండఅంతాకూడ జరుగుతున్నది. ఇప్పుడు అత్యవసరముగా లక్షరూపాయలు రైట్ ఆఫ్ చేయాలనిచూస్తున్నాడు. దానిగురించి మంత్రిగారు ఆలోచించాలని చెప్పుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri M. SUBBA REDDI:—

తాత్కాలికాధ్యక్షా! కో ఆపరేషన్ డిమాండుమీాద cut motion ను move చేస్తూ శ్రీ కృష్ణారావుగారు కోపరేటివ్ మూమెంటును గురించి ఫండమెంటల్ విషయాలను గురించి చాలా విపులంగా చెప్పారు. ఈ దేశంలోనే కాక ఇతర దేశాల్లోకూడా ఎలా వున్నది చెప్పారు. కాబట్టి యీా దేశంలో మనం కోపరేషన్ను ఎంతవరకు అనుసరిస్తున్నాము అని చూస్తే ఈ principles మనలోలేవు. వెస్టెడ్ ఇంటరెస్టును share holders లేకుండా వుండాలని చెపుతున్నారు. నామి నేటెడ్ డైరక్టర్లునుగాని, ఛేర్మెన్గాని వుండకూడదని చెప్పారు. ఈ రెండూకూడా యిక్కడ వున్నాయి. మా నంద్యాల హౌస్‌బిల్డింగు

Sri M.Subba Reddi] [19th March 1954

కోపరేటివ్ సొసైటీని ఉదాహరణగా తీసుకొనిన చాలును. ఆహారోత్పత్తి క్రింద వున్న భూమిని యిళ్ళకు తీసుకో కూడదని మంత్రిగారు నేను ఉదయం ఒక విషయములో చెప్పాను. కాని మా నంద్యాల హౌస్‌బిల్డింగ్ సొసైటీకి 2 కారులు పండే భూమిని 30 యెకరాలు తీసుకొన్న ఇందులో అర్థమేమిటో నాకు తెలియలేదు. ఈ భూమి అనుకూలమైనది కాదని మున్సిపల్ వారు ఆరోగ్య శాఖ వారు చెప్పినాకూడా దాన్ని తీసుకొన్నారు. వారు తీసుకొనినప్పటికి 2 సంవత్సరాలుగా ఎందుకు బంజరులుగా పెట్టారని నేను అడుగుతున్నాను. ఒక్కొక్క కారుకు 600 వందల బస్తాలు చొప్పున రెండు కారులకు 12 వందల బస్తాలు అవుతుంది. అయితే ఇక్కడ ఇళ్ళపని ప్రారంభించేప్పటికి 5 అడుగులలోనే నీళ్ళు తేలాయి. పునాదులనుండి గోడ ఆరడుగులకు వచ్చేటప్పటికి కూలిపోయింది. ఈ సంజీవనగరం యీ విధంగానే కూలిపోతుందా అని నా అనుమానం. పోనీ గట్టిప్రయత్నం చేశారంటే ఎండాకాలం వచ్చేప్పటికి ఎండలవల్ల cracks యిస్తుంది. కడకు యీ సంజీవనగరం cracks తోనే ప్రారంభమౌతుందేమో అని నా అనుమానం. తరువాత ధనవంతులకు డబ్బు యివ్వడంకూడా అంత బాగాలేదు. ఎందుచేతంటే అక్కడ చాలామంది ధనవంతులు వున్నారు. ఈ సొసైటీలో 220 మంది members వుంటే, అందులో లక్షాధికారులు కూడా వున్నారు. చాలామంది యిళ్లువున్నవాళ్ళే. అంటే, double యిళ్ళు కావాలని (నవ్వు) ఇళ్ళు కావలసిన వాళ్లకు ఇళ్ళు, డబ్బు కావలసిన వాళ్లకు డబ్బు యిస్తున్నారు. నంద్యాల నుంచి కర్నూలుకు వచ్చే రస్తాలో పూడుమాల్పూరు అనే హరిజనగ్రామంలో మొత్తం 40 యిళ్లు గత వరదల్లో కొట్టుకు పోయాయి. అది జరిగి యిప్పటికి రెండు సంవత్సరాలయింది. వాళ్ళను విచారించే దిక్కులేదు. ఈ విషయము నేను ఎన్నో సార్లు వెల్‌ఫేర్ ఆఫీసర్లకు చెప్పాను. ఇక ఈ ఎండాకాలంలో వాళ్లకు నీళ్ళుదొరికే ఎత్తులేదు. 1 మైలు పోతేగాని నీళ్ళు దొరకవు. ఈ విషయాలన్ని వాళ్ళు మమ్మల్ని అడుగుతుంటారు. మేము వాళ్ళకు ఏమి సమాధానం చెప్పాలో తెలియదు. ఏదైనావుంటే ప్రభుత్వం దృష్టికి తీసుకరమ్మని చెపుతున్నారు. కాబట్టి

19th March 1954] [Sri M. Subba Reddi

ఈ విషయాలను ప్రభుత్వదృష్టికి తీసుకరావాలనిచెప్పి మాట్లాడ్డం తప్ప మరేమీలేదు. మా నంద్యాలలో చాలా Bank లు వున్నాయి. వాటి స్థితి ఏ విధంగా వున్నది నేను చెప్పవలసిన అవసరంలేదు. Land mortgage Bank లో అప్పుకావాలంటే దానికి 2, 3 సంవత్సరాలు పడుతుంది. అది గ్రామ కరణంతోటి ప్రారంభంకావాలి: మామూలుగా పట్టా నెంబరు కావాలంటే ఆయనకు డబ్బియివ్వాలి. జాయింటు పట్టాను విడతీసి ఇవ్వాలంటే ఆయనకు డబ్బుయివ్వాలి. వాటిని తీరా తీసుకొచ్చి Central Land Mortgage Bank కి పంపిస్తే ఇంకో 1 సంవత్సరంపడుతుంది. తరువాత చెక్కు వచ్చేటప్పటికి భూతాలుచేరుతాయి. నేను కొంతకాలం treasurer గా వుండేవాణ్ణి. అప్పుడు ఎందుకు బయట ఇంతమంది కాచుకు కూర్చున్నారని అంటే, వాళ్ళకు ఏదో డబ్బు కావాలట అన్నారు. సబ్ డిప్యూటి రిజిస్ట్రారు భూములు తనిఖీ చేయుటకు వెళ్ళిన కారు ఖర్చులుకూడ అందులో వున్నాయి. వీళ్లు కంట్రిబ్యూట్ చేయడం ఏమిటి అని ఆశ్చర్యం వేసింది. ఇక మిగతా సొసైటీలు వున్నాయి. అన్నిటిలోను కూడా mismanagement. misappropriation తయారు అయింది. అక్కడవున్న 4 societies నాలుగువిధాలుగా తయారు అయ్యాయి. ఈ కో-ఆపరేటివ్ మూమెంటు District control తో ప్రాముఖ్యం వహిస్తేగాని successful కాలేదు. ఇది successful గా తయారుచేయాలని చెపుతున్నాను. పాపం కర్నూలులోని shroff merchants డబ్బులేనివాళ్ళని చెప్పి ప్రభుత్వం ఇక్కడ వాళ్ళకు స్థలాలు యివ్వడమే కాకుండా కట్టుకొనుటకు డబ్బుకూడా యిచ్చారు. వీరు చాలా పేదవాళ్ళని చెప్పి యిచ్చారు కాబోలు.

The Hon. Sri D. SANJIVAYYA:— ప్రతిసారి గౌరవ సభ్యులు ఈ house building society ని గురించి నేనేదో చేసినట్లు మంత్రిగారు మంత్రిగారంటూ నా వైపు తిరిగి మాట్లాడుతూ వున్నారు. ఇది నేను చేసిందికాదు. మేము మంత్రివర్గంలోకి రాకపూర్వమే అది యివ్వబడింది.

An. hon. Member:— అది శ్రీ సీతారామ రెడ్డిగారు చేశారు లేండి.

19th March 1954]

Sri M. VENKATASUBBA REDDI:- అటువంటి పనులు చేసినందుకు తగిన ప్రతిఫలం అనుభవించారు రంగన్నాయకులేండి ప్రజలు. (నవ్వు).

నేను general debate లో పాల్గొనడానికి వీలులేకపోయింది. మన రాష్ట్రంలో ఎన్నికలలో నాట్లవిద్యాచ్ఛక్తి ఉత్పత్తిఅవుతోంది. ఈసంవత్సరం ఎన్ని కుసెక్కు నిరు సప్లయి చేయగలుగుతున్నాము, ఎన్నిమైళ్ళు dust proof రోడ్లు వేయించగలుగు తున్నాము. ఎన్ని house building societies ను ఏర్పరచగలిగాము అని మనము బడ్జెటు ఏర్పరచడంలో చూడవలసినదికాదు. కాని బడ్జెటువల్ల common man ఏవిధంగా బాగు పడుతున్నాడు అని చూచి ఆ విధంగా ఈ బడ్జెటు తయారుచేస్తే బాగుం డేది. తారు రోడ్డు వేయడము సబబేగాని కర్నూలునుంచి అనంతపురం పోయేరోడ్డుకు తారువేయడం మాత్రం బాగాలేదు. దానివల్ల లాభం పొందేది ఒక జిల్లాయే. కర్నూలునుంచి నంద్యాల పోయేరోడ్డుకు తారు వేస్తే 10 జిల్లాలవాళ్ళకు లాభం కలుగుతుంది.

Sri P. VENKATASUBBAYYA:- అధ్యక్షా! భారత సంవిధానం ప్రకారం మన రాజ్యంగలక్ష్యం కో ఆపరేటివ్ కామన్‌వెల్తు అన్నారు. ప్రభుత్వాలు కూడా co-operative movement ను అమలుపరుస్తున్నాయి. కాని వీటిని అమలుపర్చడంలో శ్రద్ధా భక్తులు చాలా అవసరం. 'Co-operation అనగా సహకారంలో ఒక వ్యక్తి వ్యక్తులందరి కొరకు, అందరువ్యక్తులు వ్యక్తికొరకు అనే పరమసూత్రం వుంది. ప్రభుత్వం యీ సూత్రాన్ని అమలు పర్చాలి. సామాన్య ప్రజలకు అందరికి co-operative principles సరిగా తెలియవు. కాబట్టి co-operative colleges పెట్టి శిక్షణయివ్వడమేగాకుండా, కళాశాలల లోను స్కూళ్ళలోను ఇదొక ప్రత్యేకsubjectగా బోధిస్తే బాగుంటుంది ప్రాథమిక పాఠశాలల నుంచి ఉన్నత పాఠశాలల వరకు అందరికి దీనిని గురించి బోధిస్తే దీనిని సులభంగా నిత్యజీవితంలో అమలు పర్చడానికి వీలవుతుంది. Co-operative societies లో అధ్యక్షులు, కార్య దర్శులు. మెంబర్లు అందరికి co-operative principles సరిగా అర్థం

గాక వాటిని అమలు పర్చలేక తప్పుతోవను పోతున్నారు. అందుచేత regional conferences పెట్టి ప్రెసిడెంట్లకు, కార్యదర్శులకు, తక్కిన మెంబర్లకు కో-ఆపరేటివ్ సూత్రాలను బోధించాలి. గౌ॥ మంత్రిగారు ఉపన్యశిస్తూ జనాభానుబట్టి నూటికి 30 మందికి, నూటికి 50 గ్రామాలకు ఈ సూత్రాలను అమలుపర్చేటట్లు చెయ్యదలచామనే ఆత్రత తెలియ పర్చారు. కాని వాటి నేవిధంగా జయప్రదంగా అమలు పర్చదలచిందీ తెలియపర్చలేదు. 30% ప్రజానీకానికి ఇవి అందుబాటులోవుండాలని జిల్లా రిజిస్ట్రారులు అభిప్రాయపడుతు దానికిగాను సకలార్ధ సహకారసంఘాలను పెట్టాలని సలహా లిచ్చారట. దానిమీద జిల్లా కోఆపరేటివ్ బ్యాంకుకు సంబంధించిన సూపర్వైజర్లు పోయి ఎక్కడెక్కడ వాటిని నిర్మించాలో వ్రాసుకు రమ్మన్నారట. వారు పోయి వారి యిష్టమువచ్చినట్లు వ్రాసుక రావడం వారి రిపోర్టులప్రకారం సంఘాలను స్థాపించడంజరిగింది. సకలార్ధ సహకారసంఘాలు పెరిగాయి కాని వాటి quality మాత్రం పెరగలేదు. అప్పులు కావాలని ఆ సంఘాలు దరఖాస్తులు పెట్టుకోవడం .దానిమీద హడావుడిగా, ఆలోచించుకోకుండా బినామీ loans యివ్వడం తర్వాత ఆ అప్పులు వసూలు కాకుండా Central Bank లు నష్టపడి పోవడం జరిగింది. ఉదాహరణకు, కడప జిల్లా Central Bank నుంచి ఈ సంఘాలు తీసుకున్న అప్పులు, బకాయిలు పడిపోతే వీటినిగురించి విచారించడానికి సెంట్రల్ బ్యాంకుకు స్పెషల్ ఆఫీసరును వేశారు. వారు ఎన్నిచోట్లకు తిరిగి విచారించినా ఈ అప్పు లిచ్చిన తాలూకు పత్రాలుకూడా సరిగా లభ్యంకాలేదు. కాబట్టి సంఘాలు పెరగడమేకాకుండా qualityకూడా పెరిగితేగాని లాభంవుండదు. ఈసహకారసంఘాలు అభివృద్ధికి రావాలంటే credit side లో ఇప్పుడు ఉంటున్న unlimited liability వుండకూడదు. ఈ పరిమితిలేని liability పద్ధతివల్ల వీటిలో పనిచెయ్యడానికందరూ భయపడుతున్నారు ఒకసంఘం వుందంటే అందులో అప్పులు పుచ్చుకొన్నవారు బకాయిపెట్టి ఎగగొడితే ఏ డబ్బుకలిగిన వ్యక్తో సభ్యుడుగావుంటే ఆ వ్యక్తికిగల ఆస్తిని పూచపుల్లతోసహా వేలంవేసి వసూలు చేస్తారు. అట్లాగే ప్రెసిడెంట్లు, డైరెక్టర్లు యొద్దకూడ వసూలు చేస్తారు. దీనివల్ల ఎవరూ ఉత్సాహంగా వీటిలోకి రావడంలేదు. అందువల్ల limited liability వుండాలి.

19th March 1954] ]Sri P. Venkatasubbaiah

అంతేకాక పేదసాదలకు ఈ సహకార సంఘాలవల్ల ఉపయోగం కలగడంలేదు. ధనికులంతా సంఘాలలో చేరడము వాటిని దుర్వినియోగం చెయ్యడం జరుగుతోంది. కాబట్టి poor mans co-operative societies స్థాపించి గ్రామాలలోవుండే వాళ్ళకు ఆ గ్రామంలోనే నివాయితి గలిగిన మనిషి సర్టిఫికేట్ యిస్తే వాళ్ళను సభ్యులుగా చేర్చుకుని 30 మొదలు 50 రూపాయిల వరకు అప్పులు యిచ్చే ఏర్పాటుచేస్తూ దీనికొక నిధి యేర్పాటుచేసి మూలధనం సేకరించడంలో ప్రభుత్వం subsidy యివ్వాలి. Poor man's co-operatives నిధి అని సెంట్రల్ బ్యాంకు నుంచి కొంత డబ్బుతీసి దీనికి కేటాయించాలి.

ఏ పట్టణంలో చూచినా ముష్టివాళ్ళు అమితంగా వున్నారు. ఏ బస్సులో ప్రయాణము చేస్తున్నా, ఎక్కడికిపోతున్నా చేతులు చాచి ముష్టి అడుగుతున్నారు. ఇది నానాటికి పెరిగిపోతుంది. వాళ్ళకు ప్రత్యేకముగా beggar home ను స్థాపించి కొన్ని ఎకరాల స్థలం కేటాయించి చుట్టూ కాంపౌండువేసి ముష్టివాళ్ళందరిని అక్కడపెట్టి వాళ్లకు పనులు కల్పించి తిండిపెట్టాలి. ఇది సహకార పద్ధతి ప్రకారం చేస్తే బాగుంటుంది. దానివల్ల beggar nuisance తగ్గిపోతుంది. ఈసహకార సిద్ధాంతాలు చాలా ఉత్తమమైనవేగాని వాటిని పేదలకుగూడా ఉపయోగ పడేటట్లు చూడాలని కోరుతున్నాను.

Sri G. ANJANEYULU:— అధ్యక్షా? మన మంత్రిగారు ఈ డిమాండుమీద మాట్లాడుతూ మన రాష్ట్రంలో 15 సెంట్రల్ బ్యాంకులున్నాయనీ ఇందులో ఏ ఒకటో రెండో మినహాయిస్తే మిగతావన్నీ బాగానే పనిచేస్తున్నాయని చెప్పారు. ఇంతకుముందు మాట్లాడినవారు 3, 4 సెంట్రల్ బ్యాంకుల్ని గురించి, అవిఎంతో గొప్పగాపనిచేస్తున్నాయని చెప్పారు. తూర్పు కృష్ణాజిల్లా బందరులో Krishna Co-operative Central Bank అని వుంది. ఆ కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకును గురించి నేను చెప్పుతాను. దానికి కొల్లిపర రమణయ్యనాయుడుగారు డైరెక్టరుగా కొంతకాలం సుమారు 10, 12 సం॥ నుండి అధ్యక్షులుగా కూడావుంటున్నారు. ఇందులో జరిగేకుంభకోణమంతా మంత్రిగారికిఅనేక మంది, సంవత్సరాలనుండి మెమోరాండమ్సు ద్వారాను యితర విధ

19th March 1954] [Sri G. Anjaneyulu

ములకూడా, సమాచారం యిచ్చారు. అక్కడవున్న బృందావన్ అనే ఒక స్థానిక పేపరులో ఏ వ్యక్తులు ఏవిధంగా ఈబ్యాంకును ఆక్రమించుకొన్నారో వివరాలిచ్చారు. కాబట్టి నేను యెక్కువగా చెప్పకుండా ఉదాహరణకు రెండు మూడు విషయాలు మీద్వారా మంత్రిగారి దృష్టికి తీసుకురాదలిచాను. నేను బుక్‌లెట్ రూపంలో, ప్రింటుచేసిన ఒక ప్రతిని మంత్రిగారికి కూడా యిచ్చాను. అంగులో చాలా వివరాలు యున్నవి అసలు ఈ కో-ఆపరేటివు సంస్థలలో యేవిధంగా ఒక మురా పాతుకుపోయిందో, యేవిధంగా ప్రజల డబ్బును, వేలకువేలు దర్వినియోగం చేస్తున్నారో మచ్చుకు కొన్ని వివరాలు మీముందుపెడతాను. ఈ సెంట్రల్‌బ్యాంకుకు వైస్‌ప్రెసిడెంటు, కృష్ణా కాపు లోన్ అండ్ సేల్సు సొసైటీ ప్రెసిడెంటు (బందరు) గుడివాడ కృష్ణా అగ్రికల్చరల్ ఇంప్రూవ్‌మెంటు సొసయిటీ ప్రెసిడెంటు అయిన వీరపనేని బసవయ్య గారున్ను, పోలవరపు నాగేశ్వరరావుగారనే యీ సెంట్రల్ బ్యాంకుల డైరెక్టరుగారున్నూ, గుడివాడ కృష్ణా అగ్రికల్చరల్ యింప్రూవ్‌మెంటు సొసయిటీ సెక్రిటరీ అయి యుండికూడా నాయుడుగారి కుడిభుజాలయిన ఈ యిద్దరు, సదరు ఇంప్రూవ్‌మెంటు సొసయిటీని దివాలా తీయించారు. సదరు బ్యాంకి తాలూకు రు 15000 వేల రూపాయలు బాకిని యీ సెంట్రల్ బ్యాంకు ప్రెసిడెంటుగారు, తన కుడిభుజాలైన ఈ వ్యక్తులను కాపాడుటకు ఆ పదిహేనువేలు బాకిని రైటాఫ్‌చేసి కాపాడినాడు. ఇక, ఈ సెంట్రల్‌బ్యాంకు ప్రెసిడెంటు రమణయ్యనాయుడుగారే బందరు కృష్ణా కో-ఆపరేటివు స్టోర్సు ప్రెసిడెంటుగా యుండి చేసిన కుంభకోణం. జి. విశ్వనాథంశెట్టిగారు (కో-రిజిస్ట్రారు) విచారించి పంపిన రిపోర్టులో యున్నది. యిదే సెంట్రల్‌బ్యాంకు డైరెక్టరున్నూ, ఒంటిమిల్లి కో-ఆపరేటివ్ యూనియన్ ప్రెసిడెంటున్ను, తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు వైస్ ప్రెసిడెంటున్ను అయిన పిన్నెంటి పామిడేశ్వరరావు మామగారైన శ్రవణం నరసయ్యనాయుడుగారు, క్రాపు లోన్ అండ్ శేల్సు సొసయిటీ (బందరు) paid సెక్రిటరీగా యుంటున్నారు. వీరు వయోవృద్ధులు, వీరు పనికిరారని, జాయింటు రిజిస్ట్రారుగారు తెలియజేసి నప్పటికి, పెయిడ్ డిపార్టుమెంటు ఆఫీసరును వెయ్యాలని సిఫార్సు చేసినప్పటికిన్ని, అదనంగా రు. 30 అంటే రు. 150 జీతంతో వీరినే కంటిన్యూ చేస్తున్నారు.

Sri G. Anjaneyulu] [19th March 1954

ఈ సెక్రటరిగారైన రమణయ్యనాయుడుగారే, శ్రీ అల్లూరిగారైన పమిడేశ్వరరావుగారిని (రా. కాం.) P. C. C ఎన్నికలో వ్యతిరేకంగా పోటీచేశారనిన్నీ, ప్రచారం చేశారనిన్నీ, కక్షతో వంగలు బస్తాలు పండి పుల్లకట్టి, ఆఖరుకు, గోడౌన్ కీళ్లు కొలగాలు కాల్చి, తాళాలు వేసి శీళ్ళు చేసినవి అనేక పుట్లకు డబ్బుయివ్వక బాధలు పెట్టుచున్నారు. అనేకమంది కాంగ్రెసువాదులు సహితం ఇది యేమి ఘోరం అని నాతో చెప్పారు. చివరకు విసిగి, గుడ్లవల్లేరు వరకు ధాన్యం తోలుకు పోయి, అక్కడ నిలవపోసి, ఇతరబ్యాంకుల్లో లోన్సు చేయుచున్నారు, అధ్యక్షా యింకొక ముఖ్యవిషయము చెప్పుతాను. ఈ రమణయ్యనాయుడుగారిని మొదట కాంగ్రెసు అభ్యర్థిగా, బందరు నియోజకవర్గానికి నిర్ణయించారు కాని, తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు బందరు టౌన్ కాంగ్రెసువారు వీరి ప్రజాసేవను గుణగణాలను సవాలుచేస్తూ ఎదురు తిరిగారు. హైకమాండువారు అప్పుడు కాంగ్రెసు అభ్యర్థిగా పార్లమెంటుకు నిలబెట్టారు. అసెంబ్లీకి కాంగ్రెసు టిక్కెట్టుమీద అనర్హుడైనవాడు పార్లమెంటుకు మాత్రం ఎలా అర్హుడు అని గ్రహించిన ప్రజలు ఈ రమణయ్యనాయుడు గారిని ఓడించి, కమ్యూనిస్టు అభ్యర్థిని గెలిపించారు. ఆ కక్షతో మరికొందరికి క్రెడిట్ సొసయిటీస్‌లో లోన్సు యివ్వకుండా రకరకాల కారణాలతో బ్యాంకిచుట్టూ తిప్పుచున్నారు. అనేక ఆర్థిక అవసరాలకు లోనైన ప్రజలు, ఈ కో-ఆపరేటివు డిపార్టుమెంటు అంటే యింత పక్షపాత వైఖరికి పుట్టిల్లు కాబోలు అనడములో ఆశ్చర్యమేమున్నదో నాకు అర్థం కావడంలేదు.

అధ్యక్షా, యిటువంటి వారంతా ఈ ప్రభుత్వపక్షాన చేరి రాష్ట్ర, జిల్లా, తాలూకా కాంగ్రెసు నాయకులుగా యుంటూ ఈ కో ఆపరేటివు సంస్థలలోచేరి, ప్రజల ధనం పానకంలాగా నారింపజేస్తూ, ఈకోఆపరేటివు ఉద్యమంయొక్క మూలసూత్రాలకే యేవిధంగా ప్రతిబంధకాలు గలుగజేస్తున్నారో గుర్తించగోర్తాను. యింకా 2 ముఖ్యవిషయాలు చెప్పి ముగిస్తాను. ఆంధ్రరాష్ట్ర బంజరు కాంగ్రెసుసంఘం అనే పేరుతో యీమధ్య ఈబడ్జెటుసమావేశానికి రాబోయేముందు మన లక్ష్మణదాసుగారు, కృష్ణమూర్తిరావుగారు మన ప్రగడకోటయ్యగారి అధ్యక్షతను, మానియోజకవర్గములో, పెడన అనే గ్రామంలో ఒక మహాసభను జరిపివచ్చారు. ఆ

[19th March 1954 [Sri G. Anjaneyulu

బంజరుమహాసభ ఆహ్వానసంఘం ప్రెసిడెంటుగారు యెవరంటే పెడన పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారున్ను, పెడన P.C.C. సొసైటీ సెక్రిటరీగారున్నూ అయిన, P. సుబ్బారావునాయుడుగారండి. వీరి నాయకత్వాన, శ్రీ ప్రకాశంగారి పేరుతో వెనుక వారు ముఖ్యమంత్రిగావున్నప్పుడు ఏర్పాటు చేసిన యీ P. C. C. సొసయిటీల తాలూకు ప్రజలసొమ్ము సుమారు రు. 20 వేలు, వీరు, ప్రగడ కోటయ్యగారి స్నేహితులు, రాష్ట్ర, హ్యాండ్లూమ్ బోర్డుమెంబరుగారు అయిన శ్రీ భట్ట కుమారస్వామి మొదలగువారు దుబారా చేశారు. ప్రజలు ప్రభుత్వానికి, కో-ఆపరేటివు డిపార్టుమెంటుకు తెలియజేశారు. ఎంక్వయిరీలమీద ఎంక్వయిరీలు చేశారు. మంత్రిగారు మదాసులోయుండగా నేను స్వయంగాకూడా కలుసుకొని, వారికి ఒక మెమోరాండం కూడా యిచ్చాను. యింతవరకు ఆ సొసైటీలో యున్న ప్రజలసొమ్ము మాత్రం వారికి చేరలేదు. చివరకు ప్రజలు విసిగి, కోర్టులో దావాలకు దిగుచున్నారు. యిదేమాదిరిగా రాష్ట్ర కాంగ్రెసు మెంబరైన (కైకలూరు తాలూకా) శంభయ్యగారు (పల్లెవాడ గ్రామం) ఆ గ్రామ సొసయిటి ప్రెసిడెంటుగా సొసయిటి డబ్బు సుమారు 7 వేలు తినివేశాడు. ఆ గ్రామ ప్రజలు ఆందోళన చేసినందుకు ప్రతిఫలం ఏమిటయ్యా అంటే సెంట్రలుబ్యాంకు ప్రెసిడెంటు రమణయ్యనాయుడుగారు ఈ ప్రెసిడెంటు శంభయ్యగారికి 10 వేలుఅప్పు శ్యాంక్షన్ చేయించాడు. ఈఅప్పులు ఎవరిపేర వ్రాశారో, ఎంక్వయిరీ చేయించితే ప్రభుత్వానికి విశదమగుతుంది. ఇంకొక ఉదాహరణం యిస్తాను. నిభానుపూడి గ్రామంలో, (గుడివాడ తాలూకా) ఆ గ్రామ సొసయిటీ ప్రెసిడెంటుగారు, ఆ గ్రామ హరిజనులపేర, నూరు రూపాయలు అప్పుయిచ్చి వెయ్యిగాను, రు. 150 అప్పుయిచ్చి, 1500 రూపాయలుగాను, వ్రాసి ఒక బస్సురూట్ కొన్నాడు. యీ విషయం తెలిసి ప్రజలు, ఆందోళనచేస్తే, వారిమీద చర్య తీసుకొనుటకు బదులు, రమణయ్యనాయుడుగారు, అదే సొసయిటీకి రు. 30,000 అప్పు శ్యాంక్షను చేశారు. ఈ రమణయ్యనాయుడుగారి అండచూచుకొని ఈ ప్రెసిడెంటుగారిమీద పిటిషను పెట్టినవారిని ఆ బ్యాంకిలోనుండి తొలగించుచూ పేరు క్యాపిటల్ మనియార్డరు చేశాడు. కాబట్టి చేసిన అన్యాయాన్ని పై అధికారులకు తెలియజేసుకుంటే. అసలు మెంబర్లుగాకూడా యుండుటకు అర్హత

పోతుందని ఈ ఘటన ఋజువుచేస్తుంది. యీ విధంగా యీ సెంట్రల్ బ్యాంకులో రమణయ్యనాయుడుగారి అనుచరులు ఎంతో కాలంనుండి, డైరెక్టర్లుగాను, ఈసెంట్రలుబ్యాంకు అనుబంధసంఘాలలో ప్రెసిడెంట్లుగాను, డైరెక్టర్లుగాను యెవరెవరు ఎంతెంత మొత్తాలసొమ్ము misappropriation చేశారో, ఎంక్వయిరిచేసి ఈసెంట్రల్ బ్యాంకును సక్రమ పద్ధతిలో పెట్టి, ప్రజలకుపయోగపడునట్లు చేయునని కోరుచున్నాను.

అధ్యక్షా, మీద్వారా మంత్రిగారిని కోరేదేమంటే ఈ సెంట్రల్ బ్యాంకి ఎన్నికలు, ఈనెల 14వ తారీఖున జరిగాయి. ఈ సెంట్రల్ బ్యాంకివారే, వారి Annual Report లో సుమారు 700 వరకు సభ్యులు యున్నట్లు తెలియజేశారు. కాని సుమారు 300 లోపువరకు సభ్యులను అనేక కారణాలు చూపించి, ఆ యెన్నికలలో పాల్గొనే హక్కు లేకుండా చేశారు. అదే రిపోర్టులో కోఆపరేటివ్ ఉద్యమమంటే, "ఒకరికి అందరు, అందరికి ఒకరు" అని "ఏకత్వంలో బహుత్వం., బహుత్వంలో ఏకత్వం" అని వేదాంతం వల్లించారు ఇదేనా యీ సెంట్రల్ బ్యాంకు నాయకత్వం ఆచరణలో అసలు జరిపే నీతి, యీ నీతిసూత్రంయొక్క అర్థం అని అడుగుచున్నాను. అధ్యక్షా, ఈ బ్యాంకు ప్రెసిడెంటుగారుగాని ఇంకా ఇతర బ్యాంకు ప్రెసిడెంట్లుగాని ఇంతనిర్లక్ష్యంగా ఇంతకాలంనుండి, యిన్ని వేల రూపాయలు అపహరిస్తుంటే, ప్రభుత్వం అధికార్లు తెలియజేస్తున్నప్పటికి చీమకుట్టినట్లు యూరుకుంటున్నారంటే, సంవత్సర క్రితం బడ్జెటు సమావేశంలో చెప్పినవిషయాలే యిప్పుడు చెప్పవలసివస్తుందంటే, అసలు ఈ మంత్రులు నియోజకవర్గాలకు వచ్చినప్పుడు ఈ పెద్దమనుష్యులే వీరికి టీపార్టీలు, డిన్నర్లు ఇస్తున్నారు. ఆహ్వానసంఘాలు ఏర్పాటు చేస్తున్నారు. కాబట్టి యిప్పటికైనా. మేము చెప్పే విషయాలు మంత్రిగారు enquiry చేయించి ప్రజలకు యీ కో ఆపరేటివ్ సంస్థలు ఉపయోగపడునట్లు చేస్తారని ఆశిస్తూ యింతటితో ముగిస్తున్నాను.

(At this stage Mr. Speaker resumed the Chair.)

Sri T. NAGIREDDI:— ఈ విధంగా ఈ Co-oparativ department లో జరిగిన విషయాలు ఇలా ప్రభుత్వ దృష్టికి తీసుకొ

వస్తుంటే ఇక్కడ దీనికి సంబంధించిన మంత్రి గారు ఆసమయంలో లేరు. వారు వుండడం చాలా అవసరమని చెపుతున్నాను.

Mr. SPEAKER:—మంత్రిగారు వచ్చారు. ఆయన యివన్నీ వింటూ వుంటారు. ఇపుడే బయటికి వెళ్లారు. అయినా గౌరవ సభ్యుడు మంత్రి గారితో యీ విషయం చెప్పినట్లు, printed booklet యిచ్చినట్లు చెప్పారు. అది వారుచూసేవుంటారు.

* The Hon. Sri D. SANJIVAYYA:— నాకు ఆయన printed booklet యిచ్చారు. ఆ పుస్తకం నేను రాత్రి చదివాను. అంతేకాకుండా ఆ డిపార్టుమెంటు వారిని information కొరకై అడిగాను. ఈ విషయమై information వచ్చినతరువాత దీనినిగురించి ఆలోచిస్తాను.

* R. SIDDHANNA GOWD:— అగ్రాసనాధిపా, యీ demand పైన మాట్లాడుతూ గౌరవనీయులైన మంత్రిగారు glorified picture నొకదానిని యిచ్చారు. అంతేకాకుండా వారు Administration Report లో కూడా డబ్బావాయించుకొన్నారు. దీనిని ఎలా నమ్మాలో అర్థంకాకుండా వున్నది.

* The Hon. Sri D. SANJIVAYYA:—On a point of order ప్రభుత్వం administration report లో డబ్బావాయించుకొన్నారని చెప్పడం సబబు కాదని నేను చెపుతున్నాను.

Sri R. SIDDHANNA GOWD:—అన్ని report లు ఇలాగే ఉన్నాయి. చాలా విచారకరమైన విషయం. Quality మాత్రం పూజ్యంగా ఉంది ఈ Co-operative పరిపాలన ఇలా కుంటుపడడానికి ఎవరు బాధ్యులు? ప్రజలూ, బాధ్యులే. కొంతవరకు Co-operative Department కూడా బాధ్యత కలిగియున్నది. Deputy Registrar నుంచి ప్రజలు ఎన్నుకొన్న Directors, Members ఈ సహకారోద్యమాన్ని పాడు చేస్తున్నారు. అనంతపురంలోవున్న సహకార సంఘం, బ్యాంకులుగురించి అక్కడవున్న సహకార వస్త్రాల సహకారోద్యమ చరిత్ర వ్రాస్తే ఒక పెద్దచరిత్రగా తయారవుతుంది.

19th March 1954] Sri R. Sidhanna Gowd

కక్షలలో చేరి ఒక సంవత్సరంలో నిర్మాణం కావలసిన సొసైటీలను 4 సంవత్సరాలలోనైనా నిర్మాణం చేయడంలేదు. దీనిని గురించి complaints ఇస్తే organisers వుండేవాణ్ణి తొలగించారు. స్టోర్సును తీసుకుంటే, న్యాయంగా admit కాబడిన 130 మంది మెంబర్లకు నోటీసు యివ్వకుండా, 144 సెక్షను ప్రయోగించి రాకుండా చేసినారు. ఈ విషయంలో రాజగోపాలాచార్యులుగారికి మువ్వాను రాష్ట్రంలో వుండగా స్పెషల్ D. O. 4—9—53 న వ్రాసినారు investigation చేయించమని. ఏమైనదో తెలియదు. కేవలం మంత్రిగారికి వ్రాసాం. విచారణ చేయిస్తాము అని చెప్పినారు. ఏమిచేయలేదు. బిల్డింగు సొసయిటీల విషయంలో కూడా అధ్వాన్నంగానే వున్నది. ఇక Co-operative Societies Act చాలా old and outmoded గా వున్నది. సెక్షన్ 15 గురించి చెబుతాను. Special requisition ఇస్తే meeting జరిపి తీరాలి. సొసయిటీ ఉద్యోగులు డిపార్టుమెంటువారికి వ్రాస్తే వారు జరిపించితీరాలి. ఎన్నో requisitions పంపించాము. డిపార్టుమెంటు వాళ్ళు నిర్వహించలేదు Local Boards Act ప్రకారంకూడా జనరల్ బాడీ మీటింగుపిలిస్తే సమావేశపరచి agenda లో వుండే విషయాన్ని చర్చించాల్సి వుంటుంది. దీన్ని సవరించాలని కోరుతున్నాను. Unlimited, Limited liability గల సొసైటీలలో ఉద్యోగులుగా వుండేవాళ్ళు వారికి యిష్టములేనివారిని చేర్చుకోరు. ఇదిచాలా abuse కు త్రోవతీస్తుంది. నన్నుకూడా యీ కారణంచేత చేర్చుకోలేదు. నా పోటి వాళ్లనే చేర్చుకోలేదంటే, ఇంతకంటే abuse of powerవున్నదా? ఇంకొక provision వున్నది. Society term of office అయిపోగానే ముందుగానే డిపార్టుమెంటువారు యోచనచేసి దానికి చర్య తీసుకోవలసివస్తుంది. reconstitute చేయకపోతే S-25 (1) (a) క్రింద extend చేయవచ్చు. Circulars Nos. 19569/47-A dated 28-5-1947 and Rc. No. 173075/49 dated 28-12-1949 ప్రకారం అక్రమంగా నిర్వహించబడుతున్న వాటిపై డిపార్టుమెంటువాళ్లు తగినశ్రద్ధ తీసుకోక 4, 5 సంవత్సరాలైనా general body meet కాకుండానే సొసైటీ వ్యవహారాలను జరిపిస్తున్నారు. ఈ విధంగా కక్షలలోచేరి Co-operative ఉద్యమాన్ని ధ్వంసము చేయుడం జరుగుతోంది. మంత్రిగారు డిపార్టుమెంటుపైన కఠినచర్య తీసుకోకపోతే

సహకార ఉద్యమమే అభివృద్ధిలోనికి రాదని చెప్పడానికి చింతిల్లుచున్నాను.

Sri G. SIVASANKARA REDDI:— అధ్యక్షా, ఈ కో-ఆపరేటివ్ ఫీల్డులో చాలామంది non-co-operators బకాసురులుగా మాత్రము వుంటున్నారు అని నా అభిప్రాయం. గ్రామాలలో credit societies form చేయాలంటే Deputy Registrar, Special Development Officer, Central Bank లాంటివెన్నో departments ద్వారా ప్రయత్నాలు జరుగవలసివుంటుంది. దానివల్ల delay అవుతుంది. వాటి Managers, Secretaries చాలాకాలంగా వుంటూవుండడంవల్ల, వారికి ఘుమపులు చెల్లిస్తేనేకాని ఏమిజరుగదు. ఒక సొసయిటీ form చేయాలంటే సంవత్సరాలతరబడితీసుకోకుండా కొద్దినెలల్లోపూర్తయ్యేట్లు rulesమార్పుచేయడంమంచిది అని నేనుసలహాయిస్తున్నాను. ఈసొసయిటీలలోను, Land Mortgage Bank వంటి సంస్థలలోను గవర్నమెంటు అధికారులు సెక్రటరీలుగా, managers గా వుంటున్నారు. వీళ్లు చాలాకాలంగా వుంటూ మామూళ్ళు వసూలుచేసుకుంటూ పేదవాళ్లకు సహాయం జరుగకుండా అడ్డుకలిగిస్తున్నారు. అందుచేత వీరిని కనీసం 3 సంవత్సరాలకు ఒకసారి అయినా మార్పు చేయించాలి. Land mortgage bank whole sale co-operative stores ఇలాంటి సంస్థలకు రెండు ఏళ్ళకు, మూడేళ్ళకు ఒకసారి ఎన్నికలు వస్తున్నాయి. shareholders directors ను మాత్రం ఎన్నుకోడం అందులోనుంచి, President, Vice-President ను ఎన్నుకొనడం జరుగుతోంది. ఈ సంస్థలు, చాలామట్టుకు తాలూకా Headqurters లో వుండడంవల్ల డైరెక్టర్లు అక్కడేవున్న shareholders లో అవసరమైనవారిని వుంచుకుని, దూరంగావున్న ఫిర్కాల్లోవున్న shareholders ఎక్కువ మంది రావడానికి వీలులేకుండా meetings పెట్టుకుని తమకు అనుకూలంగా వ్యవహారం నడుపుకోడానికి వీలువుంటుంది. తమకు కావలసినవారికే సహాయం చేయడం, మిగత ఫిర్కాలలో వున్నవారికి సహాయం చేయకుండావుండడం జరుగుతోంది. ఇలాంటి పద్ధతినితొలగించి కారణంలేనిదే ఏ share నూ reject చేయడానికి వీలులేకుండా ఉత్తరువు చేయాలి అని కోరుచున్నాను. ఇంక డైరెక్టర్లను ఎన్నుకోనేటప్పుడు,

[19th March 1954 [Sri G. Sivasankara Reddi

firka war లేక area war పద్ధతి పైన, ప్రతి ఫిర్కానుండి, లేక ప్రతి ఏరియానుండి ఎంతమంది directors ను ఎన్నుకోవాలో నిబంధనలను ఏర్పాటుచేయాలి. జిల్లాలో Deputy Registrar, Special Development Officer, Assistant Development Officer లతో కొన్ని డిపార్టుమెంటులు ఏర్పాటు చేశారు. ఈ Special Development Officers Gazetted Officers అని అంటున్నారు కాని కనీసం Revenue Inspectors లేక Village Officers అయినా వీరిని ధిక్కరించినప్పుడు వారిమీద ఏరకమైన చర్య తీసుకోడానికి అవకాశం లేనివారు ఏమి Gazetted Officers? ప్రభుత్వం వీరిని ఎందుకు వేసిందో తెలియదు. Field Labourers' Co-operative Societies గాని Land Colonisation Co-operative Societies గాని ఏర్పాటు చేయడం వీరి కర్తవ్యం. వీరు ఏర్పాటు చేయడానికి అన్ని ఆటంకాలు. వీరు సొసయిటీలు ఏర్పాటుచేసి డిప్యూటీ రిజిస్ట్రారును రిజిస్టరు చేయమని ప్రార్థించాలి.

హిందూపురం తాలూకాలో వాసవోలుగ్రామం, గుంటుపల్లి పెనుకొండ తాలూకాలోని దిగువ చెర్వుపల్లె గ్రామములమధ్య కొన్నివందల యకరాలు బంజరు భూములను ఫీల్డులేబరు సొసైటీసుకు ఇవ్వాలనివారు 1950 సం॥మున అభ్యర్థించగా అసిస్టెంటు డెవలప్మెంటు ఆఫీసరుగారు నేను వాసవోలు విలేజి ఆఫీసర్నుకు కబురంపగా వారు రాక ఆ ఆఫీసరు దిగువచెరువుపల్లెకి పోయి ఫీల్డు లేబరర్ సొసైటీని ఒకదానిని స్థాపించి, సుగాలీలు కూడావచ్చి వేరుమొత్తం చెల్లించినపుడు వారికి భూములు యివ్వాలని ఒక తీర్మానం ప్యాసు చేయించారు. కాని ఆ వాసవోలు విలేజి ఆఫీసర్ను లంచం తీసుకొన్నందున మాకు తెలియకుండా రిపోర్టు వ్రాస్తే దానినిబట్టి రెవెన్యూ ఇన్స్పెక్టరు తాసీల్దారు ఆ విధంగా రిపోర్టు చేస్తే భూములు ఇవ్వడానికి వీలులేదని స్పెషలు డెవలప్మెంటు ఆఫీసరు గారికి కలెక్టరుగారు తెలియచేశారు. ఈ స్పెషలు డెవలప్మెంటు ఆఫీసర్ను ఎన్ని సిఫారసు రిపోర్టులు పంపించినా, రెవెన్యూ ఆఫీసర్లు ఖాతరు చేయలేదు. ఈ అధికారంలేని ఆఫీసర్లకు బదులు, జిల్లాను రెండు భాగాలుగాచేసి ఇద్దరు డిప్యూటీ రిజిస్ట్రార్లను వేస్తే సొసైటీసును ఫారమ్ జేసి రిజి

స్టరు చేయడం సులభం అవుతుంది. ఏలాంటి బంజరుభూములను సొసైటీ లకు ఇవ్వాలో ఆలోచించి ఆయా సొసైటీసును రిజిష్టరు చేయించి సక్ర మంగా function చేయడానికి తగిన అధికారంకూడా వారికే యివ్వటం మంచిది. డిప్యూటీ రిజిస్ట్రారు ఆ సొసైటీలను రిజిస్టరు చేసిన పమ్మట గజెటెడ్ ఆఫీసర్సయిన ఈస్పెషల్ డెవలెప్‌మెంటు ఆఫీసర్లు, జిల్లా కలె క్టర్లను సొసైటీలకు భూములు assign చేయమని ప్రార్థించాలి. విలేజి ఆఫీసర్సు లంచాలుతిని డెవలప్‌మెంటు ఆఫీసర్లు చేసిన దానికి వ్యతిరేకంగా వ్రాయడం దానిని రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు, తహ సీల్‌దార్లు సిఫారసుచేయండంవల్ల కలెక్టర్లుగారు హెడ్‌గావున్న రెవిన్యూ డిపార్టుమెంటు జిల్లాలోకల్ల పర్మనెంటు డిపార్టుమెంటు అని తలచేందుకు గాను తన రెవిన్యూ సబ్బార్డినేట్సు అయిన ఆర్. జి. ఓస్. రిపోర్ట్సు విని uphold చేసి గజెటెడ్ ఆఫీసర్సయినా యితర డిపార్టుమెంటువారి చర్య లకు సహకారమివ్వక వారిenthusiasm ను crubచేసి ప్రభుత్వ సదు ద్దేశ్యమైన ఈకో-ఆపరేటివ్ సొసైటీసును మూలకు నెట్టడం జరుగుతున్నది. కనుక యీ రెవిన్యూ డిపార్టుమెంటు యొక్క తలబిరుసుతనము indifferent behaviourను సత్వరమే తొలగించుటకు ప్రభుత్వంపూను కోవాలి. ఈ విధముగా చేయనంతవరకు ఈ కో-ఆపరేటివ్ మూవ్‌మెంట్ ఏ మాత్రం ప్రజలకు వుపయోగపడడం సాధ్యంగాదు కాబట్టి ప్రభుత్వం వారు వెంటనే కలెక్టర్లవద్దనుంచి ఈ నిరంకుశ అధికారములను తీసివేసి డిప్యూటీ రిజిస్ట్రార్సుకు ఈ మాత్రమైన ప్రత్యేక అధికారాలిచ్చి సక్రమ ముగాను, ఎఫెక్టివ్‌గాను ఈ మూవ్‌మెంటును నడిపించాలని చెప్పుచున్నాను.

Sri G. SURYANARAYNA:— అధ్యక్షా, మన ఆంధ్రదేశ ములో సుమారు 16 లక్షలమంది శిల్పకారులు జీవనము సరిగ్గాలేక చాలా కష్టాలు పడుతున్నారు. వారికి కో-ఆపరేటివ్ సొసైటీ పెట్టి వారికి కావలసిన పరికరములను తయారుచేయించి సహాయపడవలయునని నేను కోరుచున్నాను.

బిల్డింగు సొసైటీలవల్ల బీదవారికి యేమీ లాభంలేదని చెప్పాలి. కారణము ఏమంటే బీదవారు డిపాజిటు కట్టలేరు. డిపాజిటు కట్టవలెను.

కొలకొలది డబ్బువున్నవారే డిపాజిట్లుకట్టి యిప్పుడు కట్టుకుంటున్నారు. బీదవారికి డబ్బులేక ఇళ్లు కట్టుకోలేకుండా వున్నారు. కాబట్టి ప్రభుత్వం దీనికి సరియైన పద్ధతి చూడాలి. ఈ ఏరియాలో సొసైటీలలో వారికి స్థానం వుండేటట్లు చెయ్యవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను. [illegible]లో అనేక లక్షలనుంది హరిజనులు, వ్యవసాయ కూలీలు వృత్తులు లేక కష్టాలకు గురిఅగుచున్నారు. వారికి కూడా కో-ఆపరేటివ్ సొసైటీలు స్థాపించి వాటిద్వారా ధన సహాయముచేసి వెనుకబడ్డ ప్రజలకు సహాయము చెయ్యవలయును. విశాఖపట్నంజిల్లాలో ఈ కో-ఆపరేటివ్ సొసైటీలద్వారా అప్పులు యిప్పించకోరుచున్నాను. ప్రస్తుతము, యీ సంఘము 10 ఎకరాలు 20 ఎకరాలు వున్నవారికేకాని నిరుపేదలైన జనులకు ఏమీ అందడంలేదు. 50/- రూ. అయినా యివ్వడంలేదు. ఈ విషయం ప్రభుత్వం ఆలోచించవలెనని కోరుచున్నాను.

Sri K. VARADACHARI:— అధ్యక్షా, చాలా కాలముగా ఆంధ్రరాష్ట్రం మద్రాసు రాష్ట్రములో కలసి ఉండేవరకుకూడా ఆ రాష్ట్రములో కోఆపరేటివు ఉద్యమము వృద్ధిపొందుచున్నట్లు విస్తరించినట్లు మొత్తంలో ఫస్టు అని ప్రసక్తికలదు. ఈ రాష్ట్రంలోనే ఇంత ఘనంగా ఉందని సభ్యులు చెబుతున్నారు. దానినిబట్టి చూస్తే ఇతర రాష్ట్రాలలో కోఆపరేటివు ఉద్యమం ఎంతమాత్రముగా వున్నదో తెలుస్తున్నది. ముఖ్యముగా నా అనుభవాన్ని బట్టి సుమారు 35 సంవత్సరాలనుంచి చూస్తున్నాను. మన ఆంధ్రదేశములో నేను చూసినంత వరకు డిపార్టుమెంటును సంఘాలు, సంఘాలను డిపార్టుమెంటు ఎక్స్‌ప్లాయిట్ చెయ్యడమే కనబడుతున్నది శివశంకర రెడ్డిగారు ఉమ్మడి రక్తం [illegible]రుడు అన్నమాట అన్నారు ఇది ఎంతమాత్రం అతిశయోక్తి [illegible]యుతున్నాను. ఆ వాక్యము నిండా సత్యం అయిన వాక్యము. [illegible]లు పనిచేసే విధంచూస్తే అసహ్యం వేస్తుంది. మా చిత్తూరు [illegible]న్నో పీవర్సు కోఆపరేటివు సంఘాలు ఏర్పడి దాని మూలం[illegible] మార్కెటింగు జరిగింది. వర్కర్లు విక్టిమైజు కావడం దరిద్రం [illegible]డం జరిగింది. అంతేగాని మరి ఏమీలేదు.

ఇదిగాక అక్కడ కోఆపరేటివ్ హోల్‌సేల్ సొసయిటిలో ఒక గాన్తా 10000 రూపాయలపైచిల్లర కొట్టేశాడు. అది వసూలుచేసి ...ష్యను తప్పించారు. ఇంకో స్టోరువుంది దానిలో డైరెక్టర్లే కొను దార్లుగా ఏర్పాటుచేసుకున్నారు. స్వంత వ్యాపారము కోసము ఉపయోగించుకోవడం జరుగుతూవుంది. 2, 3, 4 సంవత్సరాలదాకా ు వసూలు కాకుండా వుండడం జరుగుతున్నది.

ఇక ఈ డిపార్టుమెంటుచూస్తే డిప్యూటి రిజిస్ట్రారు, సబ్ రిజిస్ట్రారు, క్టర్లు లెక్కలేకుండా వున్నారు. ఎంత సిబ్బందివున్నా ఆడిటు ు నెలల తరబడి జరుగుతుంది. అయినా పెద్ద పెద్ద మొత్తాలు ్టిలోకి ఎట్లు రాకుండా పోతుందో తెలియదు.

ింకొక విషయం. కొనుగోలు చేయడంలో చాలా అన్యాయం న్నది. బిల్లులుమాత్రం తీసుకువస్తారు. ప్రైవేటు మార్కెటులో ారులోనో మిరపకాయలుకొంటే ఆబిల్లులకు చెక్కు లేదు. ఈ లన్నీ చెక్కు చెయ్యలేని డిప్యూటీ రిజిస్ట్రార్లను ఎందుకు వేశారో . వాళ్ళ మొఖంచూస్తే ఇంటెలిజన్సుగాని, అండర్‌స్టాం ఉన్నట్లు తెలియదు. ఈ డిప్యూటి రిజిస్ట్రార్లు నిరక్షరకుక్షులు. 'ry to make this statement. ఎన్నో కేసులలో వారు ాశాను. వాదించడానికి వీరికి ఏమీ తెలియదుగాని పవరు ిరికి వుంది. జుడిషియల్ పవర్సుకూడా వారికి యిచ్చారు. ులేదు. ఏ ప్రశ్న వెయ్యాలో తెలియదు. అలాంటిస్వాములు రిజిస్ట్రార్లు. ఈ డిపార్టుమెంటు ఓవరుహాలు చెయ్యడానికి వున్నాయేమో చూడవలెను. మన విశ్వనాథంగారు, రు ఓవరుహాలు చేస్తారని నమ్ముచున్నాను.

VENKATANARAYANA DORA;— అధ్యక్షా! ో-ఆపరేటివ్ దేశము కావలెనని అన్నందులకు నేను ఒక ను. ఇప్పుడు వున్న ప్రెసిడెంట్లు, సెక్రెటరీలు సెంట్రలు ెచ్ఛేధనమును వారు వారి కుటుంబీకులు పేర ...

వ్యక్తులు, ప్రెసిడెంట్లు, డైరెక్టరులుచేసేవిషయాలనుగురించి ప్రస్తావించినట్లుచెప్పారు. విన్నాను. నిజముగా అవి అన్ని ఇన్నాళ్లు గా వారు వాండ్ల హృదయములో అట్లనేపెట్టుకొని ఈనాటికిచెప్పుతున్నారా? ఏకారణంచేత బయటపెట్టలేక పోయినారో నాకు తెలియకున్నది. కే. కృష్ణారావుగారు చేసిన ఉపన్యాసానికి వారిని అభినందించుచున్నాను. వారు ఉద్యమం ఏలా ప్రారంభం అయింది, ఏవిధంగా నడుస్తుంది, వాటిని ఏ విధముగా సవరించవలెనో సమగ్రముగా చెప్పారు. అందులో ఒకటి రెండు విషయాలతో నేను ఏకీభవించలేక పోతూఉన్నాను పెద్ద పెద్ద జమీందారులను ఈ సహకార సంస్థలలో చేర్చకూడదనిన్ని, అందుకు తగిన రూల్సుపెట్టి ఏర్పాటు చేయవలెనన్నారు. ఇండియా సంవిధానము (కాన్‌స్టిట్యూషన్) ప్రకారము ఫండమెంటల్ రైట్సుకు అభ్యంతరం వస్తుంది. తన చెప్పుచేతలలో వుండే వాండ్లను సభ్యులుగా పెట్టుకొని సంఘాన్ని, స్వంత ఉపయోగానికి వినియోగించుకుంటున్నారు. సరిగా పనిచేసేవానిని అధ్యక్షుడుగా ఏర్పాటుచేస్తే బాగాఉంటుంది. సహకార సంస్థలు ఆటానమస్. చట్టరీత్యా జనరల్ బాడీకు అధికారం ఉంది.

Sri K. VARADACHARI:— The hon. Minister is wrong in thinking that there is no rule against these things. A rule can be framed, if necessary, that any society shall be entitled to refuse membership to anybody. If you can make that as a fundamental rule, then you can meet this difficulty.

The Hon. Sri D. SANJIVAYYA:—Then the autonomous character of these societies will vanish:

దీనిలో ఇంటర్‌ఫియరన్సు ఉండకూడదని అంటూవున్నాము. షరతుపెట్టితే అందులోవుండే స్వేచ్ఛకు, లోపముకలుతుంది. ఆకారణంచేత అట్లనే పెట్టడం మంచిదని నాకు తోచుచున్నది. తరువాత అనేక విషయాలు ఉన్నాయి. కొన్నికొన్ని బాంకులు, మచిలీపట్ణాం, తెనాలి, బాంకుల విషయాలు ఆంజనేయులుగారు అంతా చెప్పారు. చాలా కంప్లెయింట్లు వచ్చినాయి. రెజిస్ట్రారుగారు విచారణచేస్తు వున్నారు. తగిన చర్య తీసుకుంటాము. నాగభూషణంగారు మాట్లాడారు. రాయదుర్గంలో

19th March 1954] [Sri D. Sanjivayya

సరియైన ఫెసిలిటీసు లేవని అన్నారు. వాటిని పరిశీలించి తగు ఏర్పాట్లు చేస్తాం. తరువాత శ్రీ గల్లు సుబ్బారెడ్డిగారు మాట్లాడుతూ హౌసు బిల్డింగు సొసైటీలనుగురించి చెప్పారు. అవి చాలామట్టుకు నిజమే. ఆ విషయము గురించి తరువాత చెప్తాను.

కో-ఆపరేటివ్ ఔగ్గర్సుహోం, పెట్టితే బాగుంటుందని అన్నారు. దీనినిగురించి Deputy Registrarవారికి వ్రాశాము. వీలయినంతవరకు త్వరలో ఏర్పాటు చేయటానికి ప్రభుత్వం చేస్తుందని మనవిచేస్తున్నాను. తరువాత శ్రీసిద్దప్పగౌడగారు Section 15 నుండి కొత్త Rules ను గురించి కో-ఆపరేటివ్ సొసైటీస్ out-dated అని ఏమోఅన్నారు. దీని విషయమై, నేను, ప్రశ్నలలో. సమాధానంచెప్పాను. దీనికి ఒక Bill ready గావుంది. సవరణలు జరిగిన తరువాత ఒక Bill గా తయారు చేసి శాసనసభలో, సభ్యులముందు ప్రవేశపెట్టి ఆమోదింప చేస్తామని అనుకొంటున్నాను. శ్రీ శివశంకరరెడ్డిగారు చెప్పినది ఒకటి మాత్రం అది నిజంగా చాలాకాలంనుండి వున్నది. మద్రాసు రాష్ట్రములో వున్నప్పుడు దీనిని వెంటనే పరిశీలించాలని అడిగినాను. రివిన్యూబోర్డు పరిశీలిస్తున్నది. ఏవిధంగాచేస్తే బాగుంటుందో అన్నివిషయాలు ఆలోచిస్తున్నారు. రిపోర్టు రాగానే తగుచర్య తీసుకుంటాము.

Sri జీ. సూర్యనారాయణగారు శిల్పులకు కొంత సహకారం ఇచ్చి సహాయంచేస్తే, బాగుంటుందని, అన్నారు. 3, 4 రోజులక్రిందట శిల్పులు కొంతమంది శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలనుండి వచ్చి మెమోరాండం యిచ్చారు. దానిని రిజిస్ట్రారువారికి అందచేశాము. దీనిని శ్రద్ధతో పరిశీలిస్తామని చెప్పారు. తరువాత సొసయిటీలను (societies) ఏర్పాటు చేయమని చెప్పారు. హరిజనులను ఏమిచేయటం లేదని శ్రీ సూర్యనారాయణగారు అనటం సత్యదూరం అని చెప్పాలి. F. L. O, ల ద్వారా వారికి ఉపకారం జరుగుతున్నది. శ్రీ వరదాచార్యులుగారు మాట్లాడుతూ, హోల్ సేల్ డిపోలలో డైరెక్టర్లే, కొనటం బాగుంటుందా, అని అన్నారు. ఇన్స్పెక్టర్లను గురించి ఏమో అనుకుంటున్నారని అన్నారు. ఒకరిని గురించి ఒకరు ఎప్పుడూ అనుకుంటూనే వుంటారు.

ఈ శాసనసభలో వచ్చేవారిని గురించి విమర్శించటం సమంజసమేనా? అని నాకు సందేహము కలుగుతున్నది.

Sri S. VEMAIAH:— నిరక్షరాస్యులని అంటే, చదువురాని వారనా?

The Hon. Sri D. SANJIVAYYA:— చదువు రానివారని కాదు అర్థము. Half knowledge అని చెప్పాను. దానికి అంత పెద్ద అర్థము తీసుకోగూడదు. శ్రీ వెంకటనారాయణదొరగారు, మాట్లాడుతూ హరిజనుల గురించి, వారి సౌకర్యాలను గురించి మాట్లాడుతున్నారుగాని, కొండజాతులవారిని గురించి మాట్లాడటం లేదని అన్నారు. కొండజాతుల వారికి జరిగే సహాయం గురించి వారికి తెలియదుగాబోలు. ఇప్పటికప్పుడే కొన్ని stores అక్కడ పనిచేస్తున్నవి. వాటిని ఇంకా ఎక్కువ చేయటానికి ప్రారంభం చేస్తున్నాం. నా దృష్టికి వచ్చినటువంటి ఏ complaint అయినాగాని, నేను సమగ్రంగా పరిశీలించటమో, Registrar గారిద్వారా పరిశీలింపచేయుటమో, చేసి దానికి తగిన చర్యలను వెంటనే తీసుకుంటున్నాను. అక్కడక్కడ కొన్ని జరుగుచున్నమాట వాస్తవమే. గత 4, 5 శాసనసభ సమావేశాలలోను ఇప్పుడుగూడా వీట్లనుగురించి complaints వచ్చినవి. ఈ సమావేశాలు అయిన తరువాత, కొన్ని కొన్ని జిల్లాలకు, surprise visits చేసి, లోపాలున్న చోట్ల తీవ్రమైన చర్యలు తీసుకొనవలెనని అనుకుంటున్నాము. దీనినిబట్టి అధికార్లు ఎప్పుడువస్తారో అనే భయము, వీళ్ళలో కలుగుతుంది. వారు బాగుపడతారుగూడ. ఆవిధంగా చేయటానికి, ఆలోచిస్తాము. కాబట్టి cut motions withdraw చేసుకొని ఈ demand ను pass చేయవలసినదిగా కోరుతున్నాను.

Mr. SPEAKER:— The question is:

That the allotment of Rs. 56,20,000 under Demand No. XX — Co-operation be reduced by Rs. 100.

The motion was lost.

19th March 1954]

Mr. SPEAKER:— The question is:

That the Goveanment be granted a sum not exceeding Rs. 56,20,000 under Demand No. XX — Co-operation.

The motion was carried and the grant was made.

DEMAND XVI–MEDICAL.

The Hon. Sri D. SANJIVAYYA:— Sir, On the recommendation of the Governor, I move:

That the Government be granted a sum not exceeding Rs. 1,01,46,100 under Demand No, XVI -Medical.

ఇప్పుడు demand XVI (Medical) వైద్యశాఖకు సంబంధించిన ఖర్చు క్రింద ఒకకోటి, ఒకలక్ష, నలుబది యారువేల వంద రూపాయలు (Rs. 1,01,46,100) sanction చేయవలసినదిగా, యీ సమావేశములో ప్రవేశపెడుతున్నాను. ఈ వైద్యశాఖ యొక్క కర్తవ్యము కేవలం, రోగనివారణకు చికిత్సచేసే విషయములోనే. దీనికి సంబంధించి- ఒక్కొక్క జిల్లా కేంద్రంలో ఒక Head quarters ఆసుపత్రివున్నది. ఈ విధంగా అన్నిచోట్లా వున్నాయిగాని, శ్రీకాకుళం జిల్లాలో మాత్రం ఒకటి 50 మంచాలు, కలిగిన ఆసుపత్రియున్నది. దానినిగూడా జిల్లా కేంద్రానికి తగినట్లు Headquarters ఆసుపత్రిగా మార్చాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. తాలూకా కేంద్రాలలో ఆసుపత్రులు వున్నాయి. Local Fund ఆసుపత్రులు వున్నాయి. ఇవి జిల్లా బోర్డుల ఆధిపత్యములో వున్నవి. విడిగా కొన్ని వున్నాయి. తాలూకా కేంద్రములో వున్నటువంటి ఆసుపత్రులను స్వాధీనము చేసుకొనడానికి ఒకవిధానాన్ని అనుసరిస్తున్నాము. ఆ విధానం ప్రకారం, యిప్పటికప్పుడే దాదాపు 60 ఆసుపత్రులను స్వాధీనము చేసుకొని నడిపిస్తున్నాము. ఇంకా స్వాధీనము చేసుకొనే విషయములో 54 55 సంవత్సరములో చిత్తూరుజిల్లా పుంగనూరు ఆసుపత్రి తరువాత తూర్పుగోదావరి జిల్లా రాజోలు, తరువాత అడ్డతీగల, వీటిని తీసికొనుటకు నిశ్చయం జరిగింది. ఆవిధంగా జరుగుతుంది. జిల్లాల కేంద్రాలలో వున్నటువంటి Headquarters ఆసుపత్రులలో beds strength చాలినంత లేదని,

మందులు చాలటంలేదని, రోగులు ఎక్కువమంది వస్తున్నారు - వారికి యిబ్బందిగా వుంటున్నదని, complaints వస్తున్నవి.

ఇక్కడ కర్నూలుజిల్లా Head-quarters Hospital చూచినట్లయితే, sanctioned bed strength కన్న, 50, 60 మంది patients ఎక్కువ ఉంటున్నారు. వీరికి beds లేక, వరండాలలో జంబుఖానాలు వేసుకొని ఉంటూ ఆవిధంగానే treatment తీసుకొంటూ యున్నారు. అటువంటి పరిస్థితులలో, మనయొక్క ఆర్థికలోపము ఎంత ఉన్నప్పటికి ఈవిధముగా ఎక్కువగా rush ఉన్నటువంటి hospitals లో కొంతవరకు bed strength increase చేస్తే బాగుంటుందనే ఉద్దేశ్యంతో వచ్చే సంవత్సరం ఈ క్రిందివిధంగా bed strength increase చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

| | |
|---|---|
| చిత్తూరుజిల్లా, తిరుత్తని గవర్నమెంటు హాస్పటులో | 4 beds |
| చిత్తూరు Headquarters Hospital లో | 34 beds |
| చిత్తూరుజిల్లా తిరుపతి Govt. Headquarters Hospital లో | 19 beds |
| అనంతపురం Headquarters Hospital లో | 50 beds |
| అనంతపురంజిల్లా, హిందూపురం Govt. Head quarters Hospital లో | 11 beds |
| అనంతపురంజిల్లా, గుత్తి Govt. Headquarters Hospital లో | 13 beds |
| గుంటూరుజిల్లా, గుంటూరు Govt. Headquarters Hospital లో | 10 beds |
| నెల్లూరుజిల్లా, ఉదయగిరి Headquarters Hospital లో | 4 beds |
| మొత్తం | 145 beds |

దీనికి ఖర్చు 14,225 రూపాయలవుతుంది. ఇంతేకాకుండా, ఇప్పుడు కర్నూలు రాజధాని Headquarters అయినందువల్ల, ప్రస్తుతము వున్న 154 sanctioned bed strength ను, 200 వరకు ఈ సంవత్సరం పెంచడానికి ఏర్పాటు జరుగుతున్నది.

ప్రభుత్వము దీనికిగాను కొంత grant ఇస్తూనే యున్నది. యీ rural medical relief గురించి Bhore committee వారు చేశిన సిఫార్సుల ఆధారంగా చేసుకొని కొన్ని primary centres స్థాపించారు. కాని అవి బాగా పనిచేయడంలేదు. అక్కడ వేసుకటువంటి M. B. B. S., డాక్టర్లు చాలాకాలము ఉండడములేదు. తరువాత ఇప్పుడు మనకు ఆర్థిక మాంద్యము వున్నది. Five years plan కు చాలావరకు డబ్బును వినియోగిస్తున్నాము. ఈ రెండు కారణాలచేత అవి సరిగా పనిచేయడం లేదు.

మద్రాసు రాష్ట్రములో వున్నప్పుడు D. M. O's. conference జరిగింది. అప్పుడు ఈ rural medical relief గురించి చర్చించారు. ఎంత గొప్పగా చదువుకొన్నటువంటి, డాక్టరైనా సరే, ఒక ప్రత్యేకమైన శాస్త్రములో పరిశోధన చేసినవాడైనా సరే, ఒక గ్రామమునకు వెళ్ళి అక్కడవుండి practice మొదలుపెడితే ఆ ప్రజలు, ఈ డాక్టరు మన వూరి ఆయన, ఈ డాక్టరు ఏమి పనికిరాడు, గుంటూరుకో లేక మద్రాసుకో పెద్ద డాక్టర్ల వద్దకు పోవాలనే ఉద్దేశ్యంతో ఉంటున్నారు, అనే అభిప్రాయము తెలిపారు. కనుక దానికి బదులుగా ఈ Mobile Hospitals పెట్టి, అవి ఒక తాలూకా కేంద్రములో ఉన్నటువంటి Hospitals ను ఆధారంగాపెట్టుకొని దానిచుట్టుప్రక్కలఉన్న గ్రామాలకు వెళ్లుతూవుంటే బాగుంటుందని ఒకరు సలహాఇచ్చారు. ఆ సలహా ప్రకారం, వచ్చే సంవత్సరం ఏప్రెల్ 54 నుండి రెండు యీ Mobile Hospitals పెట్టుతున్నాము. అవి కోస్తా జిల్లాలలో ఒకటి, ఈ జిల్లాల ఒకటి పెట్టుతున్నాము.

తరువాత ప్రత్యేకమైనటువంటి కొన్ని విషయాలున్నాయి. Leprosy వున్నది. దీనిని ఏవిధంగా నిర్మూలిస్తే బాగుంటుందని ఆలోచించి ఈ ప్రభుత్వము ఒక unit కు ఒక doctor ను, దానికి సంబంధించిన ఉద్యోగస్తులను వేసి దీనినిదర్యాప్తు చేసి ఎక్కడెక్కడ ఈ కుష్టువ్యాధి ప్రబలంగావున్నదో ఏ విధంగా అరికట్టితే బాగుంటుందనే విషయాన్ని, విచారించి తగిన సూచనలు యివ్వడానికిని ఏర్పాటు చేస్తున్నాము.

తరువాత Mental Hospital మనకు ఒకటేవున్నది. ఎండలు

Sri D. Sanjivayya] [19th March 1954

ముదిరినట్లయితే ఏమవుతుందో తెలియదు. ఈ Hospital ను అభివృద్ధి చేయడానికి 27.15 ఎకరాలభూమిని, 4లక్షలా 10 వేల విలువ కల దానిని, స్వాధీనం చేసుకోడానికి ఏర్పాట్లు అవుతున్నాయి. ఆ Hospital Waltair లో వున్నది. దాన్ని అభివృద్ధి పరచినట్లయితే చాలా సహాయకరంగా ఉంటుంది.

తరువాత గుంటూరు విషయము చెప్తాను. బడ్జెటులో అక్కడ కాలేజీకోసం 9.66 లక్షలు, Hospital కోసం 10.31 లక్షలు, కేటాయింపు జరిగింది. అయితే ఇంకా కొంతధనము ఖర్చుపెట్టి ఇంకాకొన్ని buildings ఏర్పాటు చేసినట్లయితే ఇక్కడకూడా విశాఖపట్నంలో వున్నటువంటి విద్యాసంస్థ తయారవుతుంది. అప్పుడు యీ రెండు సంస్థలలోను తయారయ్యేటటువంటి Medical graduates మన ఆంధ్ర దేశములో ఎన్నో hospitals లో పనిచేయడానికి కావలసినంతమంది వుంటారు. అప్పుడు ఈ medical relief ప్రజలందరికి అందుతుందని ఆశిస్తున్నాను. ఇక ఈ డిమాండు మీద చర్చ ప్రారంభించవలసిందని సెలవు తీసుకొంటున్నాను.

Mr. SPEAKER:— The motion moved is

"That the Government be granted a sum not exceeding Rs. 1,01,46,100 under Demand No. XVI Medical"

I am selecting the cut motion of Sri M. Veerabhadram and the other cut motions will be deemed to have been moved and admitted.

* Sri M. VEERABHADRAM:— అధ్యక్షా! I beg to move my cut motion.

"To reduce the allotment of Rs. 1,01,46,100 under Demand No. XVI - Medical" by Rs. 100.

నాపేరట వున్నటువంటి ఈ కోతతీర్మానాన్ని ప్రతిపాదిస్తూ కొన్ని ప్రధానమైనటువంటి విషయాలను చెప్పాలనుకొంటున్నాను. అసలు ఈ డిమాండును మంత్రిగారు ప్రతిపాదిస్తూ చెప్పినటువంటి ఉపన్యాసాన్ని చూచినట్లయితే మేడిపండులాగా వున్నది. పైకిమాత్రం చాలాబాగా కనిపిస్తున్నది గాని లోపల అన్నీ పురుగులే.

19th March 1954]

* The Hon. Sri D. SANJIVAYYA:— మేడుపంగులాగా అన్నారుగాని మేడుపంగు కాదుగదా!

* Sri M. VEERABHADRAM:— ఈ రోజు ఆంధ్ర దేశములో ప్రజలకు medical facilities ఏ విధముగా వుపయోగించేటట్లు చేయగలము అనే విషయములో ప్రభుత్వానికి ఒక సమగ్రమైన దృక్పథము లేదని స్పష్టమగుచున్నది.

ఉదాహరణకు విశాఖపట్టణములో General Hospital వున్నది. గుంటూరులో Medical College వున్నది. కనుక గుంటూరులో ఈ హాస్పిటల్‌లో facilities ఎక్కువ చేస్తున్నారు. ఇన్ని facilities అంటే ఆంధ్రరాష్ట్రంలో యీ రెండు చోట్లలో వున్నన్ని facilities ఇతరజిల్లాలకు ముఖ్యంగా అనంతపురం, చిత్తూరు, కడప జిల్లాలవారికి అందుబాటులో లేదు. వైద్య సహాయము కొరకు గుంటూరుగాని, విశాఖపట్టణంగాని వెళ్ళవలసి వుంటుంది. యీ జిల్లాలలోని వాళ్ళు ఎంత దూరము వెళ్ళవలసి వుంటుందో, ఎంత డబ్బు ఖర్చు చేసికోవలసి యుంటుందో, డబ్బువున్నవాళ్ళు వుంటారు, లేనివాళ్ళు వుంటారు, అందు వల్ల వాళ్ళకు ఎంత యిబ్బందులు కలుగుతాయో ప్రభుత్వము గుర్తించాలి. అందువల్ల వారందరు అంతదూరము వెళ్ళటానికి సాధ్యమయ్యేది కాదు. కావున ఆజిల్లాల ప్రజలకు అందుబాటులోవుండే కర్నూలులో గాని, అనంతపురంలోగానివున్న హాస్పిటలును, జనరల్ హాస్పిటల్‌గా చేయాలి. వైద్య సౌకర్యాలు అలా యేర్పాటుచేస్తే, విశాఖపట్టణముదకు పోవలసిన అవసరముండదు. అంతే కాక ప్రతిజిల్లా హెడ్ quarters town లోనూ, తాలూకా హెడ్ quarters town లోనూ హాస్పిటల్ వుండాల్సిన అవసరమున్నది. అదే విధముగా ప్రతి తాలూకా Headquarters hospital కు రెండు, మూడు mobile vans యేర్పాటుచేసి, చుట్టు పట్ల గ్రామాలకు ప్రోగ్రాము ప్రకారము వెళ్ళి ప్రజలకు వైద్యసహాయ్యము చేయాలి. అంటే అన్ని ఒకేసారి ఏర్పాటుచేయడం సాధ్యంకాకపోవచ్చు. కాని ఒక ప్లాను ప్రకారము రెండు, మూడు సంవత్సరాలలో రాష్ట్రమంతటను ఏర్పాటుచేస్తే, ప్రజలకు సౌకర్యముగా వుంటుంది. ఈ ఏర్పాట్లు రాజకీయాలతో సంబంధం వుండకూడదని నా సలహా.

19th March 1954] [Sri M. Veerabhadram

హాస్పిటల్సు improvements క్రింద ఈ సంవత్సరము 11 లక్షల రూపాయలు new … … పద్దుక్రింద ప్రభుత్వం ఖర్చు పెట్టబోతున్నారు. అది బాగా వుంది. ఎక్కువగా ఖర్చు చేస్తున్నందుకు నాకు సంతోషమే. అయితే అది సరిగా ఖర్చు పెట్టబడుతుంది అనేదే ప్రశ్న. హాస్పిటల్సులో ప్రధానంగా అక్కడకి వచ్చే patients కు treatment ఏ రకంగా జరుగుతున్నదో చెబుతున్నాను. ఈ రోగులు వచ్చినప్పుడు, ముఖ్యంగా ఈ హాస్పిటల్సులో పై నుంచి క్రిందివరకు most rotten and corrupt అయిందని చెబుతున్నాను. దీనికి నేను అనేక ఉదాహరణలు చెప్పగలను. హాస్పిటలుకు రోగులు వెళ్ళితే, వారికి యిచ్చే చికిత్స విషయం చెప్పేముందు, మరొక విషయం చెప్పాలనుకుంటున్నాను. హాస్పిటల్సులో డాక్టర్లలో clinical professor and non-clinical professors అని ఉంటున్నారు. Non-clinical professors కాలేజీలకు సంబంధించినవారు. Clinical surgeons హాస్పిటలులో డాక్టరు ప్రొఫెషన్ చూస్తూవుంటారు. Non clinical professors కు 600 జీతాలుమీద start చేస్తూవుంటారు. అయితే వీరికి private practice, consulting fees allow చేయకూడదు. Clinical surgeons కు 450 రూపాయలమీద start చేస్తారు. అయితే వీరికి private practice చేయటానికి Govt. allow చేస్తారు. దీన్ని గురించి G. O. వుందట. Clinical side లో ఉన్న డాక్టర్లకు ఎంతజీతము ఇచ్చినా, యింకను వారికి దాహము చాలక, consultation fees అనిన్ని, ఇంకా patients నుంచి చాటుమాటున తీసుకుంటానేవుంటారు. నిజాయితీగావుండే వారిని వేళ్ళమీద లెఖ్ఖపెట్టవచ్చు. అట్టి వారికి మనం యెంతో పురస్కారంచేయాలి. ఈ విధంగా ఈ హాస్పిటల్సులో వున్న మొత్తము డాక్టర్లు అందరున్నూ consultation fees తీసుకోవటం జరుగుచున్నది. ఎవరైన హాస్పిటలులో admission కావాలని వెళ్ళితే, అతను ఆ డాక్టరు యింటికివెళ్ళి, యే 20 రూపాయలో యిస్తేగాని మరునాడు అతనికి admission దొరకదు. అతను ఆడబ్బు యివ్వలేనివాడై యివ్వకపోయినసరే, యివ్వగలిగినవాడై ఇవ్వకపోయినసరే, అతనికి admission దొరకటము దుస్తరము. గట్టిగా అడిగితే waiting list లో పేరు చేర్చుతాడు. యిక ఆవిధంగా లిస్టులో పేరు

19th March 1954 ] [Sri M. Veerabhadram

యెక్కి-స్తే, యిక అతను బ్రతికివున్నంత కాలము, పేరు అందులోనే వుంటుంది కాని admission మాత్రం దొరకకుండా వుండే పరిస్థితులు ఈ హాస్పిటల్సులో జరుగుతున్నవి. Consulting fees పేరుతో లంచగొండితనము మితిమీరి పోతోంది. కావున consulting prac-tice ను వెంటనే నిషేధించాలి. దానికి బదులుగా హాస్పిటల్ లోనే సాయంత్రం consultation యేర్పాటు చేయాలి. సలహా కావాలని వచ్చినవారికి వారిఆదాయాన్నిబట్టి ఫీజువసూలుచేసి, ఆ ఫీజును surgeon కు assistant surgeon కు నర్సుకు, ఆయాకు, ప్రపోర్ష నేటుగా పంచాలి.

కాబట్టి, యీ consulting fees అనే దానిని పూర్తిగా రద్దు చేసి, మద్రాసులో ఒక హాస్పిటల్‌లో అసలు జరిపిన పై విధానాన్ని మన రాష్ట్ర ప్రభుత్వ హాస్పిటల్సులో అమలు జరపాలి. అలా చేసిన యెడల, యీ హాస్పిటల్సులో జరిగే అన్యాయాలు చాలామటుకు తగ్గే అవకాశము వుండగలవని నమ్ముతున్నాను.

ఇక యీ Corruption విషయము ఆలోచిస్తే Corruption ఎక్కడచూచినా ప్రబలంగా వుండనేవుంది. మంత్రిగారికి చెబితే, ఏదైనా ఒక కేసు particular గా తెలియజేస్తే నేను action తీసుకుంటాను. generalise చేసి చెబితే యేమిచెయ్యను అని అంటారు. ఒకనాడు హాస్పిటలుకు సరిగా రాత్రి 8 గంటలకు డాక్టరు రావలసివుంటే ఆయన 10 గంటలకువచ్చి రోగులకు నిర్లక్ష్యంచేశాడని నేను మంత్రిగారికి complaint, చేస్తే negligence of duty, క్రింద ఆయనను punish చేయవలసివుంటే, మంత్రిగారు ఆయనను R. M. O. గా ప్రమోటు చేశారు. ఇది నేను స్వయముగా చెప్పినకేసు. ఈ రకంగాచేస్తే ప్రజలకు యీ ప్రభుత్వంమీద విశ్వాసము ఎట్లావుంటుందో ఆలోచించండి.

ఇది విశాఖపట్టణంలోని Mental Hospital Superin-tendent ను corrption కేసులో red-handed గా పట్టుకొని అప్పగిస్తే, ఆయనమీద యింతవరకు కేసుపెట్టలేదు.

The Hon. Sri D. SANJIVAYYA:— నిన్ననే ఆర్డర్లు పంపామండి.

* Sri M. VEERABHADRAM.— ఇంక కాలానికైనా పం పారు సంతోషం. అనంతపురం హాస్పిటల్ డాక్టరును arrest చేశారు, కాని ఆయనను మళ్ళీ వుద్యోగములోనికి తీసుకొన్నారు. ప్రభుత్వం దీని కేమి సమాధానం చెబుతారో?

The Hon. Sri D. SANJIVAYYA: -ఆ డాక్టరును అరెస్టు చేసి, తర్వాత బైలుమీదవిడిచారు. ఆయన కొంతకాలం suspension లో వున్నారు. కాని Departmental enquiry చేయడానికి వీలుగా ఆయనను వుద్యోగంలోనికి తీసుకోవడం జరిగింది. ఆయన మీద చార్జీలు రుజువు అయ్యేవరకు అయనను ఉద్యోగములో వుండడము కేసు కు బల మని ప్రభుత్వం ఉద్దేశించి ఆయనను re-instate చేసి మరొక చోటికి transfer చేశారు.

Sri M. VEERABHADRAM:— Enquiry ఇంకా పూర్తి కాలేదా? ఇంకా ఎంత కాలం జరుగుతుంది?

The Hon. Sri D. SANJIVAYYA:— గౌరవసభ్యులు యీ కేసు విషయము ఎక్కువగా యిక్కడ మాట్లాడకపోతే న్యాయం జరుగు తుంది. దయచేసి యింక దీని విషయం ప్రస్తావించడం మంచిది కాదు

Sri M. VEERABHADRAM:— ఆయనను re-instate చేస్తే న్యాయం జరుగుతుందని, మరల ఉద్యోగము యిచ్చి transfer చేసారా?

The Hon. Sri D. SANJIVAYYA;ఆయనను ఏచార్జీమీద suspend చేశారో, దానిమీద enquiry జరుగుతున్నది.

Sri. M. VEERABHADRAM:— Medical department లో ఇప్పటికి ఇద్దరిమీద కేసుపెట్టారు. ఇంకా ఎవరు corrupt అనే విషయము వచ్చినప్పుడు ఎక్కడ ప్రారంభించాలో నాకు అర్థంకావడం లేదు. కారణంయేమంటే యీ డిపార్టుమెంటులో నిజాయితీగా వున్నవారు బహుకొద్దిమంది. వారికిమనం నమస్కారం చేయాలి. వారు అందరు డబ్బు తీసుకొనేవారే. ఏ కొద్దిమందిని మినహాయించి

మొత్తంగా మానత్వమే లేదా అనిపిస్తోంది. పైనుంచి క్రిందివరకు corrupt and rotten గా వుంది. అయితే ఒకటి రెండు విషయాలు ప్రధానంగా ప్రజలను పీడిస్తున్న వారి విషయం చెప్తాను. కృష్ణ జిల్లా D. M. O. లంచాలు తీసుకొంటున్నాడని సుమారు 100 మంది సంతకాలుచేసిన పిటిషను మంత్రిగారికి సమర్పిస్తున్నాను.

అనంతపురం హాస్పిటల్ విషయములో డాక్టరుమీద కేసు యేమి జరిగిందో చెప్పాను. కాబట్టి యిటువంటి కేసులు ఎన్ని తెచ్చినప్పటికిని రుజువు కానివ్వకుండా ప్రయత్నిస్తారు, ఈ కేసులు రుజవు చేయాలంటే మన శాసన సభ్యులలో కొంతమందిని ఒక కమిటీగా వేసి, హాస్పిటలులోని corruption ను విచారించాలి. ఒక patient విషయములో నేను Assistant Physician తోటి మాట్లాడబోతే, నాకుచెప్పక పోగా నన్ను ఆయన 'Do you know with whom you are talking? You must know that you are talking with a gazetted officerఅని అన్నారు. నేను M. L. A. ను అని ఆయనకు తెలియదు. కాబట్టి ఈవిధంగా ప్రజలను ఈ డాక్టరు నిర్లక్ష్యంగా చూడడము జరుగుతున్నదని మీ కందరకు తెలియజేస్తున్నాను. ఈ డాక్టర్ల ప్రవర్తన యీ రకంగా వున్నది. హాస్పిటల్ లో ఎటువంటి వాతావరణం వుంటున్నదో గుర్తించాలని చెబుతున్నాను.

విశాఖపట్టణం హాస్పిటల్‌లో నా స్వయంగా తెలిసినకేసు నేను చెబుతున్నాను. ఒక బాలింతరాలు హాస్పిటల్‌వారి నిర్లక్ష్యం (negligence) వల్ల చనిపోయింది. Corminative mixture కి బదులు అక్కడ వున్న నర్సు carbolic lotion తెచ్చిపోసింది. ఆమె వెంటనే చనిపోయింది. ఇంకొక ఆమెకు ప్రమాదం కొంతలో తప్పింది. ఇంకొక ఆడమనిషికి operation చేశారు. ఆమె మంటకు బాధపడలేక డాక్టరుకు చెబితే నైట్రిక్‌ఆసిడ్ తెచ్చి అంగంలో పోసింది. ఈ కేసు నాస్వయంగా నాకు తెలుసు. ఈ patients పేదవాళ్లు కావడము వల్ల డబ్బు యివ్వనందున వీళ్ళను నిర్లక్ష్యంగా చూడడమువల్ల యీ విధంగా చనిపోవడం సంభవించింది. కాబట్టి హాస్పిటల్సులో తురితవ్యం కాని నిర్లక్ష్యం చేస్తున్నారు. ఇదంతా criminal negligence క్రిందకు వస్తవి.

ఏలూరు హాస్పిటల్ లో D. M. O. వున్నాడు. ఆయన వచ్చినప్పటినుంచి కేసులను neglect చేయుడమువల్ల రోజురోజుకు చావులు హాస్పిటల్సులో ఎక్కువ అవుతున్నది. కారణ మేమిటని ఆయనను అడిగితే యీ హాస్పిటలు నరబలి కోరుతున్నది అని సమాధానం యిచ్చాడు. అక్కడకు వచ్చిన కేసులు జాగ్రత్తగా చూడడము ఆయన duty అవునా కాదా? అని అడుగుతున్నాను. ఈ విధంగా కేసులను neglect చేస్తూవుంటే patients చావక ఏమౌతారు? ప్రజలకు యిటువంటి డాక్టరు అంటే విశ్వాసము నమ్మకము ఎట్లా కలుగుతుంది? ఇక అక్కడ హాస్పిటలులో sanitation ఎట్లా వుందంటే Public lavatory కన్న అన్యాయముగా వున్నది. అయితే ఆ హాస్పిటలు కొత్తగా కట్టినదే. Preper supervision లేకుండా ఆ హాస్పిటల్ నడుపబడుచున్నది. ఈ విషయములన్నియు మంత్రిగారి దృష్టికి పిటిషన్ మూలకంగా యిస్తున్నాను.

ఆయన క్రింది వుద్యోగులను స్త్రీలను సైతం చాల అవమానకరముగాను, అతి నీచంగాను చూస్తున్నాడు. ఆయన బాధపడలేక వారు జీతం నష్టంమీద సెలవుపెట్టి వెళ్ళిపోతున్నారు. ఆయన పై complaints వస్తే వాటిని D. M. S. గారు విచారించారు. కాని complaints ఇచ్చినవారిని విచారించలేదు దానితో యీ D. M. S. వుండగా నన్ను చేయగలిగినవాడు, ఎవడున్నాడని బహిరంగంగానే అంటున్నాడు. ఈ వ్యవహారం చూస్తే ఆంజనేయ స్వామిగా కనబడుతున్నాడు. ఇంకా తే hospitals లో యీ diet కు సంబంధించిన విషయాలు చూస్తే, అవి యెవ్వరికి తెలియవు. దీనికి ఒక G. O. వుందన్నారు. ఆ G. O. కాపీ యివ్వవలసినదని ఒక సంవత్సరం నుంచి అడుగుతున్నా, ప్రభుత్వం చివరకు యివ్వవీలులేదని చెప్పారు. ఏ ఏ రకములయిన diets యెవరెవరికి యివ్వాలో వాటికి ఎంతెంత charge చేయాలో, యేవిధంగా యివ్వాలో, యీ వివరాలు యెవ్వరికీ తెలియనీయరు. నేనొక వుదహారణ చెపుతున్నాను. నేను హాస్పిటలులో చేరుతాను. నాకు యేమందు యిస్తారో నాకే తెలియదు. తరువాత hospital కు యెంతకట్టాలో నాకే తెలియదు. ఏ diet యిస్తారో తెలియదు. వాటినిగురించి నేను తెలుసుకోకూడదు. రెండు

రకాల diets వుంటాయి. ఒకటి C.M.B. అనిన్నీ, రెండవది C.M.B. within brackets "(C.M.B.)" అనిన్నీ వుంటాయి. C. అంటే Coffee, M. అంటే Milk, B. అంటే bread అనుకొంటాను ఇంతకు దాని అర్థంయేమిటో నాకు తెలియదు. బహుశా గౌ. మంత్రిగారికే తెలియదనుకుంటాను. ఆ hospitals లోవుండే sisters ను, nurses ను మరియెవ్వరిని అడిగినా చెప్పరు. అదంతా రహస్యం. వారంతా యిటు వంటి పద్ధతుల నవలంభిస్తున్నారు.

ఒకసారి, నా స్నేహితునికి టైఫాయిడ్ జ్వరం వచ్చినప్పుడు, ఆయనను హాస్పిటల్‌లో చేర్పించవలసివచ్చింది. ఆ జ్వరానికి క్లోరోమైసిన్ వాడాలి. అది రోగులే కొనుక్కోవాలి. హాస్పిటల్‌లో యివ్వరు. కాని Hospital superintendent discretion మీద సగం ఖరీదుకు హాస్పిటల్ supply చేయవచ్చును. దానికి Superintendent గారు అంగీకరించారు. ఆ సగం ఖరీదు బజారుధరకంటెకూడా యెక్కువగా వున్నది.

'ఈవిధంగా గవర్నమెంటు పెట్టిన రూలు ప్రాణాలను కాపాడడానికి బదులు ప్రాణాలను పోగొట్టడానికి వుపయోగపడుతోంది. అందుచేత యీ రూలును పూర్తిగా రద్దుచేసి, తప్పనిసరిగా యీ costly drugs ను రోగులకు వూరికే యివ్వాలని కోరుచున్నాను.

నేను hospitals కు real గా ఆదాయం వచ్చే పద్ధతిని, సూచిస్తాను. యింతవరకు ప్రభుత్వముగాని Department గాని ఒక సక్రమమైన పద్ధతిని అనుసరించటంలేదు. ఇప్పుడు అనుసరించే పద్ధతిలో ఒక leakage వున్నది. ఇప్పుడు ఒక case తీసుకొందాము. నాకు రు. 150/- లు జీతం. కాబట్టి రూల్సు ప్రకారం ప్రభుత్వం రు. 100/- లు దాటి ఆదాయంవచ్చే ప్రతి ఒక్కరిదగ్గర hospital charges వసూలుచేయాలి అని నిబంధన చేశారు. కాని యిప్పుడు జరుగుతున్నది, నాకు జీతం రు. 150/- లు అని చెప్పానుగదా, యిప్పుడు hospital charges తప్పేటట్లు చేసుకోవాలంటే, ఆ doctor కొంత ముడుపు చెల్లించాలి. ఈ విధంగా డాక్టర్లకు ముడుపులుచెల్లిస్తే, నేను charges లేకుండా treatment పొందుతాను. దీనివల్ల hospitals కు

చిస్తున్నదా? పైగా వారు పొద్దుటనుండి సాయంకాలం వరకు పని చేయాలి అందుచేత, వారికి రు. 20 ల, రు. 25 లతో ప్రారంభించడం వెంటనే సాధ్యం కాకపోతే 1, 2 రూపాయల యెక్కువ యివ్వడం సాధ్యంకాదా అని అడుగుతున్నాను.

ఇక వారి leave విషయంచూస్తే, వారి బంధువులుగాని యెవరు చనిపోయినా సరే వారికి సెలవు యివ్వరు. కొన్ని కొన్ని సంఘటనలకు సంబంధించిన ధృవపత్రాలు మంత్రిగారికి సమర్పిస్తాను. ఒకసారి, విశాఖపట్నం hospital లో ఒక ward boy భార్యకు జబ్బుచేస్తే, వాడు శెలవుపెట్టాడు. వాడికి శెలవు grant చెయ్యలేదు. వాడు విధిలేక పోతే, వాడిని dismiss చేశారు.

ఇంకొక విషయం ఆ hospitalలో తన నాల్గవ కాన్పు సందర్భములో maternity శెలవుకు ఒక ఆయా దరఖాస్తుపెట్టుకుంటే, పెండ్లి అయినట్లు certificate కావాలన్నారు. అంతకు ముందు మూడు కాన్పులకు శెలవు యిచ్చి, నాలుగో కాన్పుకు పెండ్లి అయినట్లు certificate తీసుకురమ్మనమని అడగడం హాస్యాస్పదం. ఆయనకు నిజముగా స్పృహవుండే అడిగాడో, లేకే అడిగాడో నాకు అర్థము కావటంలేదు.

మరొక విషయం. ఒక ward boy ఒక ఆయాను పెండ్లి చేసుకొన్నాడు. వారిరువురకు ఒక బిడ్డ కల్గింది ఆ బిడ్డ తమదని ఆ యిద్దరు own చేస్తున్నారు. అయినప్పటికి superintendent వారిని పెండ్లి చేసుకొన్నట్లుగా 5 గురు సాక్షులను తెమ్మన్నాడు. దానిపై వారు 5 గురు పెద్దమనుష్యులు యిచ్చిన certificate ను దాఖలు చేశారు. అయినప్పటికి ఆ పెండ్లి recognised marriage system ప్రకారము కాలేదు కాబట్టి, ఆపెండ్లిని గుర్తించను అని చెప్పి maternity leave యివ్వనన్నారు. అయితే, యిది jungle ప్రభుత్వములో వున్నదా?

తరువాత యింకో విషయం 1952 సెప్టంబరులో ఒకరిని తోటిగా probation మీద appoint చేశారు. తరువాత కొంతకాలానికి, అంటే, 1953 సంవత్సరంలో మార్చి నెలలో వానికి ఇంకొక order

ఇచ్చారు. అదేమిటంటే, "The sweeper is appointed on probation with effect from March 1953" అని యిచ్చారు. మొదట probation మీద వాడిని appoint చేస్తూ orders ఇచ్చి 6 నెలలు అయిన తర్వాత, తిరిగి వాడిని ఆరోజు మొదలుకొని probation ప్రారంభిస్తూ appointment orders ఇచ్చారు. వానిపేరు గ. బుస్స. కాబట్టి యీ రకంగా ఒక్కొక్క medical officer ఒక్కొక్క రాజు లాగా, వీరిపై రాజులకు రాజు అంటే రాజాధిరాజు (రారాజు) Director of Medical Service. ఈ రాజ్యం లో ఒక పద్ధతిలేదు. ఒక విధానంలేదు. అంతా నియంతృత్వము నడుస్తున్నది.

ఈ hospitals సంబంధించిన ఒక G. O. వుంటే, దాని copy యివ్వడానికి వీలులేదని చెప్పింది ఈప్రభుత్వం. అది executive order అని, అది public కు యివ్వడానికి వీలులేదని చెప్పారు. ఈ మెడికల్ డిపార్టుమెంటులోని పరిపాలన చూస్తే jungle law operate అవుతోంది. Hospitals లో పని చేసే వారికి leave యివ్వక పోవడం అట్లావుంచి, యిక పని చేసే వారిని ప్రతి ఆరు నెలల కొకసారి change చేస్తారు. అక్కడపోయిన సామాన్లకు నేరం ఎవరిదో నిర్ణయించకుండానే, ఆ వస్తువు ఖరీదు ఆ పని చేసివారందరి దగ్గరనుండి వసూలుచేయడమేకాక, ఆ వస్తువు ఖరీదుతో నిమిత్తంలేకుండా చేస్తారు. ఖరీదు రు. 1 అయితే, 5 లేక 6 రూపాయలు వసూలుచేసిన సందర్భాలు వున్నాయి, ఈమధ్య జరిగిన సంఘటన చెప్తాను. ఒకసారి ఒకవార్డులో ఒక spoon పోయింది. దాని ఖరీదు 0-5-0 అయితే, వారి ముగ్గురు దగ్గరనుంచి 1 రూ. చొప్పున రు. 3 లు వసూలుచేశారు. దాని ఖరీదు 0-5-0 అయితే, రు. 3 లు వసూలు చేశారేమని అడిగితే, దాని ఖరీదు అంతేనన్నాడు. అంతట ఒకామె అయిదు అణాలుపెట్టి ఒక క్రొత్త spoon కొని తెచ్చి, యిచ్చారు.

ఆ స్పూను ఖరీదు ఐదు అణాలు అయితే 3 రూపాయలు వసూలు చేయడం చాలా అక్రమమైన పద్ధతి. అసలు ఈ recoveries పద్ధతి రద్దు కావాలి? ఆరు నెలలకు ఒక సారి వార్డులకు వార్డులే మార్పు చేస్తారు. ఈమార్పులు చేసేటప్పుడు కొంతమందిని అంట్ల

తమకు బ్రోకర్లుగా పనిచేసేవారని మార్చడంలేదు. అందరిని మార్చాలని మా వాదన. దీనిమీద విశాఖపట్టణం డాక్టరుకు నాకు ఒకవాదం వచ్చింది. దాని గురించి అడిగితే నాయిష్టం, నాకు డిస్క్రిషన్ ఇచ్చారన్నాడు. ఈ వేళ అక్కడపనిచేసే వాళ్ళందరూకూడా వాళ్ళయొక్క కష్టసుఖాలు చెప్పుకోడానికి ఒక సంఘం పెట్టుకొన్నారు. అంటే డిపార్ట్మెంటుమీద యుద్ధం చేయడంకోసంకాదు. అయినప్పటికి ఈ సంఘం పెట్టుకోవడమే నేరమైపోయింది. ఈ సంఘంలో చేరినవాళ్ళను explanation అడుగుతున్నారు. అసలు యీ సంఘం పెట్టుకోవచ్చుననికూడా ఒక G. O. ఉంది. ఏలూరు D. M. O. గారు ఈ సంఘంలో చేరిన వాండ్లకు explanation అడిగారు. Welcome address to Sri Prakasa అని Governor గారికి welcome address యిచ్చినప్పుడు కాగితం వెనుక వైపున వ్రాయబడింది. అసలు explanation తీసుకోవడమే illegal, కాబట్టి అటువంటి కాగితంపైన అతనినిభయపెట్టడానికే చేశాడు. కావలసివస్తే ఆ కాగితం నాదగ్గరేవుంది చూడండి.

The Hon. Sri D. SANJIVAYYA:—ఆయన అడిగిన expalanation కాగితం ఆయనదగ్గరే వుండాలికదా మీదగ్గర కేలా వచ్చింది?

Sri M. VEERABHADRAM:— ఎలావచ్చిందో వచ్చింది. మాకువచ్చే మార్గాలు చాలా ఉంటాయి. వస్తాయి కూడా.

The Hon. Sri D. SANJIVAYYA:— అటువంటి పనులు కూడా మీరు చేస్తున్నారన్నమాట! (నవ్వు)

* Sri M. VEERABHADRAM:— ఆవిషయాల్లో కాంగ్రెసు వారి దగ్గరనే మేము పాఠాలు నేర్చుకొన్నాం. రాష్ట్రం ఏర్పడిన తరువాత, ఈపని వారిలోకూడ సంఘ చైతన్యం కలిగి మొత్తం రాష్ట్రము మీద ఒక యూనియన్ ఏర్పడి పని చేస్తోంది. ఈ విషయం ప్రభుత్వం గమనించాలి. ఆపనివారి తరఫున వారి రాష్ట్ర సంఘంయిచ్చిన మెమోరాండంలోని అంశాలను అంగీకరించాలి. అంతే కాకుండా ఆ సంఘాలను గుర్తించాలి. నర్సస్‌ను ట్రెయిను

నింగు ఆయుకతరువాత వారికి పని కల్పించకుండా ఇంగ్లీషు పోస్ట్మని చెప్పుతున్నారు. ఈ విషయములో క్రిందటిసారి నాగిరెడ్డిగారు ఒక సలహా చెప్పారు. రాష్ట్రమంతకు ఒక్కసారి కూడా midwives గాని నాటు మంత్రసానులకు anti septic పద్ధతులు, గర్భిణీస్త్రీల శరీర శాస్త్రము సులభమైన శైలిలో చెప్పితే వారికి ఉపయోగ పడతారని చెప్పారు. అయితే ఆ విధంగా training పొందిన నర్సులను గ్రామాలకి పంపడం హాస్యాస్పదం. కాబట్టి వారికి కొన్ని సౌకర్యాలిచ్చి గ్రామాల్లో సౌకర్యాలు చేయాలి. ఇక ప్రభుత్వ హాస్పిటల్సులో పనిచేస్తున్న నర్సుల విషయం చెప్పుతాను. ఈ డిపార్టుమెంటులో ఇప్పుడు 9 (a) (i) రూలు ఒకటి అమలులో వుంది. ఈ రకం ఉద్యోగులు రాష్ట్రంలో ఎంతమంది ఉన్నారో నాకు తెలియదుకాని, ఈ జిల్లాలో వున్నటువంటి ఆస్పత్రిలో 20 మంది నర్సులు ఉన్నారు. అందులో, ముగ్గురు పెర్మనెంటు ఆరుగురు approved probationers 11 మంది 9 (a) లు ఉన్నారు. ఇదే probationers లో రాష్ట్రమంతటకూడా వున్నారు. ఈ 9 (a) (1) లో ఎవరైనాసరే నోటీసులేకుండా కారణంచెప్పకుండా ఎప్పుడైనా యింటికి పంపించవచ్చు. ఈ 9 (a) (i) కి ఎంతకాలం పనిచేసినా టెంపరరీయే. 7 సంవత్సరాలు చేసినా టెంపరరీయే. 15 సంవత్సరాలు టెంపరరీ యేమిటి? అక్రమంగా వాళ్ళచేత సౌకర్యాలు యివ్వకుండా పని చేయించుకోడానికి పెట్టినరూలిది. యీ అక్రమ రూలును వెంటనే రద్దుచేయాలి. ఈ సంవత్సరంలోకూడా కొంతమందిని తీసివేయడం జరిగింది. అసలు ప్రతి 7గురు రోగులకు ఒక నర్సు ఉండాలనివుంది. ఏ ఆసుపత్రిలోనూకూడా యీ G. O. ను అమలు పర్చడంలేదు. ప్రభుత్వం తాను జారీ చేసిన ఆర్డర్లును, అమలు జరుపకపోతే ఎందుకు ఆ ఆర్డర్లు? ఇక పోతే, Administrative side, Assistant Civil Surgeons ను ప్రమోట్ చేయడంలో అన్యాయంగా అక్రమంగా సీనియర్లును వదిలివేసి జూనియర్లును ప్రమోటు చేస్తున్నారు. అదేమని అడిగితే పోయి మీరు అపీలు చేసుకోండి అంటున్నారు. పోతే వాళ్ళ విషయం మాట్లాడేటప్పటికి ఆర్థిక శాఖామంత్రిగారు అనవసరంగా జోక్యం కలిగించుకొంటున్నారు:

The Hon. Sri T. VISWANATHAM:— మీరు ఏమైనా useful గా మాట్లాడితే నేను చెప్తాను.

Sri M. VEERABHADRAM:— మంత్రిగారు కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు సందర్భంలో మాట్లాడుతున్నప్పుడు ఏదో మాట్లాడు తుంటేగారు లేండి, వరదాచారిగారు వున్నారు. వాళ్ళంతా thick skinned గా వున్నట్లు కనిపిస్తున్నారు.

The Hon. Sri D. SANJIVAYYA:— సీనియర్ ఇన్ స్పెక్టర్సు వాళ్ళ మొఖాలు చూస్తేనే తెలుస్తుందండి. వాళ్ళు మనల్ని చూచి ఆలాగే అనుకుంటారన్నాను.

Sri M. VEERABHADRAM:—జనవరి నెల్లో నాగిరెడ్డిగారు మాట్లాడే సందర్భంలో కొన్ని సీరియస్ సమస్యలను తీసుకొని ప్రభుత్వం ఆలోచించలేదని చెప్పారు. కాబట్టి thick skinned అన్నాం. అంతే కాదు. ఈ మెడికల్ department వ్యవహారం ఎప్పుడు వచ్చినా, ఎందుకోకాని ఆర్థికమంత్రిగారు అనవసరంగా కల్పించుకొంటున్నారు.

The Hon. Sri T. VISWANATHAM:— It is more un-true.

Sri M. VEERABHADRAM:— మంత్రిగారికి అంతకోపం ఎందుకో నాకు అర్థంకాదు. ఈ మెడికల్ డిపార్టుమెంటులో promotions విషయం వచ్చేటప్పటికి మొదటివారిని, రెండవవారిని, మూడవ వారిని వదలి 10వ వారిని ఏవిధంగా ప్రమోట్ చేశారని అడిగితే merit ability అంటున్నారు.

The Hon. Sri D. SANJIVAYYA:— Selection posts D. M. O. [illegible] సీనియారిటీ [illegible] వలసిన [illegible]

(At this stage Sri G. Nagabhushanam occupied the Chair.)

Sri M. VEERABHADRAM:— Point of order అంటే నేను కూర్చుంటాను. అది కూడా వారు అనటంలేదు. ముక్కు మూసుకొని వారు మాట్లాడుతున్నారు. మెరిట్, ఎబిలిటీ అనే పేరుతో ఈరోజున ఏమి జరుగుతోందంటే, తమబంధువులను ఆశ్రితులను, గనుకలంవాళ్ళను కూడా ప్రమోట్ చేస్తున్నారు. దీనికే ఎబిలిటీ అని పేరు పెడుతున్నారు. 1947 నుంచి ఈ రోజువరకు ఈ విధంగా జరుగుతోంది. దీనికి మరొక కారణం ఏమీ కనిపించడంలేదు. ఆ సీనియారిటీ లిస్టులో ఫస్టువారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారి అన్నగారు. ఆయన్ను ఎందుకు ప్రమోట్ చేయలేదు? పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారి అన్నగారనా చేయలేదు? ఈ రకమైన పద్ధతిలో నడుస్తూ తను అప్పుల కోసం అవసరమైతే రూల్సు కూడా మార్చిన విషయం నేను ఋజువుచేస్తాను. ఇకపోతే, డైరెక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్‌కు extension యివ్వడం విషయాన్ని గురించి జనవరి 14వ తేదిన ఆయన retire అయినట్లు గెజట్ పబ్లికేషన్ జరిగింది. యింకొకరు వచ్చేలోపుగా ఆయనే కన్‌టిన్యూ అవుతారని కూడా అదే order లో వుంది. అయినప్పటికి రెండు నెల్లయినా ఇంతవరకు ఎలాంటి నిర్ణయం కాలేదు. ఈ రెండు నెలల కాలంలో తెరవెనుక పని జరుగుతోంది? మేడిపండు పైకి బాగానేవుంటుంది లోపల పురుగులు కులకుల లాడుతుంటాయి. ఇది అధ్యక్షులవారికి తెలుసు. ఆలాగే యీ రెండు మంత్రులలో మంత్రులు గుద్దులాడుకొని చివరకు I. L. B. నీవు తీసుకో D. M. S. నేను తీసుకుంటాను అని రాజీపడి పంచుకుంటున్నారు.

The Hon. Sri N. SANJEEVA REDDY:- మీకు జ్యోతిష్యము కూడా తెలుసే! (నవ్వు)

Sri M. VEERABHADRAM:— అంతేకాదు మాదగ్గర కర్ణపిశాచికూడా వుంది. ఈ విధంగా అన్యాయంచేస్తే చిట్టచివరికి ఈ పాపం బద్దలై ప్రభుత్వంమీద పడుతుందని చెప్పుతూ యింతటితో విరమిస్తున్నాను.

19th March 1954]

Sri L. LAKSHMANA DAS.—అధ్యక్షా, ఈనాడు మంత్రిగారు తీసుకవచ్చిన ఈ డిమాండును బలపరుస్తూ ఒకవిషయం మాత్రం ప్రభుత్వ దృష్టికి తీసుకరాదలచాను. రాష్ట్రములోవున్న హాస్పిటల్సుకు ఖర్చుపెట్టే ఒకకోటిపై చిలుకు డబ్బులోను గ్రామాలలో ఎంతఖర్చు పెడుతున్నారో ప్రభుత్వం గమనించడంలేదు. పట్టణాలలోనే హాస్పిటల్సు వగైరా సౌకర్యాలన్ని యేర్పాటు చేస్తున్నారుగాని పల్లెలలో ఎన్నిహాస్పిటల్సు వున్నాయి, ఎంతమంది డాక్టర్లు ఉన్నారు అనే విషయాన్ని ప్రభుత్వము గుర్తించలేదేమోనని భయం కలుగుతూంది. దానికి నిదర్శనము మా పాతపట్నం తాలూకాయే. అదృష్టవశాత్తో దురదృష్టవశాత్తో మా పాతపట్నం పట్నం కాలేదు. అక్కడే ఒక్క ఆసుపత్రికూడాలేదు 2 లక్షల జనాభాగల పాతపట్నం తాలూకాలో ఒక్క ఆసుపత్రికూడా లేదు. ప్రజలేవిధంగా బాధపడుతున్నారో ప్రభుత్వం గమనించడంలేదు. పాతపట్నం తాలూకాలో headquarters అయిన పాతపట్నం గ్రామములో ఒక హాస్పిటలు చాలా అవసరం. వంశధారానది పాతపట్నం తాలూకాను 2 భాగములుగా విభజిస్తోంది. అవతలివైపున దొర మండలములో ఒక హాస్పిటలు నియమించడం అవసరం. జిల్లాబోర్డువారు rural dispensaries స్థాపించారు గాని డాక్టర్లు దొరకడంలేదనే సాకుతో అవి సక్రమముగా నడవడములేదు. అధ్యక్షా, డాక్టర్లు లేరంటే కారణం ఏమిటి? మా తాలూకాలో ఒక గ్రామములో ఎటు పోయినా సుమారు 8 మైళ్లలో ఒక్క హాస్పిటలుకూడా లేదు. రోడ్డు సౌకర్యాలుకూడా లేవు. ఎవరికైనా జబ్బువస్తే డాక్టరును పిలిపించాలంటే ఎంత కష్టమో గమనించాలి. ఇదేవిధంగా గ్రామాలలోవుండే ప్రజలకు వైద్యసౌకర్యాలు లేక ఎన్నో కష్టాలకు గురౌతున్నారు. ప్యాసయిన డాక్టర్లు గ్రామాలకు రాను అంటున్నారు. ప్రభుత్వం ఎంతోధనం ఖర్చుపెట్టి మెడికల్ కాలేజీలుపెట్టి విద్యార్థులను తయారు చేసింది. వారు పట్నాలకు పోతున్నారు గాని పల్లెలకు రావటములేదు. దానికి ప్రభుత్వం ఒకటి చెయ్యవచ్చు. వారికి డిగ్రీలు యివ్వకముందు వాళ్లు ప్యాసయిన తరువాత ప్రతి విద్యార్థి రెండు సంవత్సరాలపాటు పల్లెలలో పని చేస్తేగాని డిగ్రీలు యివ్వమనే పద్ధతిపెడితేగాని డాక్టర్లు పల్లెలకు రారు. డాక్టరు పరీక్ష ప్యాసయిన తరువాత ఏ పట్నంలోకూర్చొన్నా కనీసం నెలకు రెండు మూడు వందలు గడించుకోవచ్చు. పల్లెలలో వారికి ఆదా

యం రాదు, సరికదా తహదారి సౌకర్యాలు లేవని సుంచిభవనాలు దొర కవని, పట్నవాసపు నాగరికత లభ్యంకాదని వారు చూస్తారు. ఈ సంవత్సరం 60 నుండి తయారౌతున్నారన్నా, వచ్చే సం॥ 100 నుండి తయారైనా ప్రజలకేమీ లాభంలేదు. వీరంతా ఏనాటికి గ్రామాలకువచ్చి ప్రజలకు సహాయంచేస్తారో ఆనాడే వారందరూ సుఖపడతారు. ఏజెన్సీ ప్రాంతాల్లో గుమ్మ, లక్ష్మీపురం, కురుపాం గ్రామాల్లో యాజ్ అనే జబ్బువుంది. ఆ జబ్బును బాగుచెయ్యడంకూడా చాలా సులువైన మార్గమని కనిపెట్టారు. పెన్సిలిన్ ఇంజక్షన్లు రెండు మూడు యిస్తే ఇది పోతుందట. గా॥ సంజీవరెడ్డిగారు మా ప్రాంతం వచ్చినప్పుడు ఈ జబ్బు తగిలినవాళ్ళను కొంతమందిని చూచారు. ఈ జబ్బు చెవికితగిలితే చెవి, ముక్కుకు తగిలితే ముక్కు రాలిపోతున్నాయి. అటువంటి రోగులకు వారానికి రెండు మూడు, సార్లు ఇంజక్షన్లిస్తే ఆ జబ్బు నయమౌతుందని చెపుతున్నారు. కాబట్టి అక్కడ వైద్య సౌకర్యాలేర్పరచి ఆ జబ్బును నయం చేయించాలని కోరుతున్నాను.

ఆస్పత్రులలో male nurses ను పెట్టడం పద్ధతి బాగాలేదు. సామాన్యంగా జబ్బుగావున్న వాండ్లకు ఆడవాళ్ళచేత సుందులిప్పించడం మంచిది. వాళ్లు దగ్గరవుండి బాగుచేస్తే జబ్బు త్వరగా నయమవుతుంది. ఏ కారణంచేతనో అప్పటి మద్రాసు ప్రభుత్వంలో రాజాగారు కొత్త పద్ధతి అవలంభించి మగ నర్సులను ఏర్పాటుచేశారు. అసలు ఆపదమే, బాగాలేదు. మగనర్సుల పద్ధతిని తీసివేసి ఆడవాళ్ళనే నర్సులుగా వుంచేటట్లయితే జబ్బులు త్వరత్వరగా నయం అవుతాయి. మగనర్సులకు ఓర్పు వుండదు. సరికదా ఇటువంటి పనులు చెయ్యడంలో విసుగు వుంటుంది.

గ్రామాల్లో వుండే dispensaries లో M. B. B. S. చదువుకున్న డాక్టర్లు రావడంలేదు. దీనికి ప్రభుత్వం యింకొకపద్ధతి పెట్టవచ్చు. రిటైర్ అయి అనుభవమున్న కాంపౌండర్లనుగాని ఆసుపత్రిలలో బాగా అనుభవమున్న నర్సులకు ప్రోత్సాహమిచ్చి rural dispensaries లో ఉద్యోగాలిచ్చి ప్రజలకు సహాయం చెయ్యాలని కోరుతున్నాను.

కాబట్టి ప్రభుత్వం నేనిప్పుడు చెప్పిన సూచనలను గమనించి [illegible] వైద్య సౌకర్యాలు కల్పించడానికి ప్రయత్నిస్తారని [illegible]

అటువంటి ప్రయత్నం చెయ్యకపోతే గ్రామసీమల్లో ప్రజలకష్టాలు వర్ణించ సాధ్యంకాదని, ముఖ్యంగా పాతపట్నం తాలూకా head-quarters లో ఒకటి, హరమండలంలో ఒకటి, వెంటనే రెండు హాస్పిటల్సును స్థాపించాలని కోరుతున్నాను.

Sri K. V. RAMESAM:— అధ్యక్షా! గ్రామాలలో వైద్య సహాయంలేదని వున్నచోట అదిచాలదని అనేకమంది సభ్యులు చెప్పారు. ముఖ్యంగా Rural dispensaries విషయంలో మన మిత్రులు చెప్పిందేమిటంటే M. B. B. S. చదువుకొన్న వాళ్ళను రెండు సంవత్సరాలు, వాళ్ళకు పట్టాయిచ్చేముందు rural dispensaries లో పనిచేయించాలని చెప్పారు. కాని యిది సాధ్యంకానిపని. ఇదివరలో కూడా మన దేశములో యీ సమస్యను గురించి తీవ్రంగా ఆలోచించడం జరిగింది. L. M. P. courses or some shortened courses ను introduce చేస్తేనేగాని ఈ సమస్య పరిష్కారం కాదని పెద్దలు కొందరు నిర్ణయించారు. రెండు మూడు సంవత్సరాలు shortened courses పెట్టి పనిచేశారు. మనరాష్ట్రంలో కూడా L. M. P. courses పెట్టి Rural dispensaries లో వైద్యులను నియమించిరి. కొంతవరకు యీ dispensaries పనిచేశాయి.

Rural Dispensaries కు కావలసినంత ధనసహాయం, ప్రోత్సాహం లేక పోవటంవల్ల అచ్చట వైద్య సౌకర్యములు ప్రజలకు సరిగా లభించుటలేదు. Rural Dispensaries కు qualified doctors పోవుటలేదు. Rural Dispensaries లో qualified doctors రావాలంటే వారికి తగు వేతనములుయిచ్చి ప్రోత్సహించవలెను. ధన సహాయ్యము, యితర సౌకర్యములు లేనందుననే L. I. M., L. M. P. qualifications గలవారు దొరకుటలేదు. Qualified doctors లేకకాదు. అందుచేత Rural dispensaries కొరకు ప్రత్యేకంగా shortened courses లో Schools పెట్టి, కొద్దిగా శిక్షణయిచ్చే యేర్పాట్లుచేయించాలి. అప్పుడుగాని ఈRural dispensaries కు కావలసిన doctors లభ్యంకారు. యింతేకాక Rural dispensaries లో కావలసిన మందులులేక పోవటం చాలాయిబ్బందిగా వున్నది. కేవలం మందులేని

మంచి గాలి వుండాలి. ముఖ్యంగా సామాన్య ప్రజలకు, అనేక పేద ప్రజలకు ఇవి లభించవు. కారణం ఏమంటే వారి పేదరికమే కారణం. కొంతవరకు పేదలకుకూడా కొన్ని రోగములను తగలకుండా, ఆ రోగాన్ని అరికట్టడానికి వీలవుతుందని నేను అనుకొంటున్నాను. ఈ పద్దు గురించి కొన్ని సలహాలు కోరాయించారు. ఇది చాలా ప్రధానమైన సమస్య. ప్రజానీకం అంతా రోగాలులేకుండా ఆరోగ్యంగా ఉండాలి అంటే ఈ సౌకర్యాలు చాలవు కాబట్టి, చాలా ఎక్కువ మొత్తాన్ని కేటాయించవలసియున్నది. ముఖ్యంగా గ్రామాలలో వైద్య సౌకర్యాలు చాలా అసంతృప్తికరంగా ఉన్నాయి. ఈ విషయమై చాలా మంది సభ్యులు చాలా సూచనలు చేశారు. ఉదాహరణకు నా నియోజక వర్గంలో, కదిరి తాలూకాలో, సుమారు 2 లక్షల జనాభా వున్నది. కాని అచ్చట తాలూకా Head quarters లో ఒక Hospital న్ను గ్రామాలలో ఎచ్చట 4, 5 Rural Dispensaries వున్నాయి. గ్రామాలలో వుండే ప్రజల ఆరోగ్యానికి ఈ Rural Dispensaries ఏమాత్రం తోడ్పడవు. గ్రామాలలోని ప్రజానీకం ఆరోగ్యవంతంగా ఉండాలంటే, వైద్య సౌకర్యాలు కల్గజేయాలి. ఇంకా ఎక్కువగా Rural Dispensaries ను స్థాపించాలి. తాలూకాకు 4, 5 Rural Dispensaries ఉంటే అవి ప్రజలకు ఏమాత్రం చాలవు. ఇంకా ఎక్కువ Rural Dispensaries స్థాపించాలి. ప్రజలు ఎక్కువ డబ్బు ఖర్చు చేయడం జరుగుతోంది. కాని ప్రజలకు ఆరోగ్యంచేకూరడం లేదు. Rural Dispensaries కు డాక్టర్లు దొరకడం కష్టంగావుంది, అంటున్నారు. L.I.M. L.M.P. Diplomaలు వుచ్చుకొన్నవారు చాల మంది వున్నారు వారికి Rural ప్రాంతాలలో పనిచేయడమంటే ఇష్టమేకాని వారికి జీతములు తక్కువ యిచ్చుటవలన Rural Dispensaries లో పనిచేయడానికి యిష్టపడరు.' Rural Dispensaries లో పనిచేయటానికి Qualified Doctors లేరన్నారు. L. I. M. L. M. P. లు ప్యాసైన qualified doctors ఉన్నారు. Rural Dispensaries లోని doctors కు జీతం తక్కువగా యుండుటవల్ల ఎవరు ఆ ఉద్యోగాలకు రావడంలేదు. వారికి తక్కువజీతం యిచ్చినట్లయితే వారికి చాలా కష్టంగా వుంటుంది. అందువల్ల ఎవరు ఆ ఉద్యోగాలకు రారు. Rural Dispensaries లో 'B' class unqualified Doctors ను వేస్తు

చిని మొత్తంచాలను కనుక వైద్య సౌకర్యాలకు ప్రజారోగ్యానికి ఇంకా ఎక్కువ మొత్తాన్ని కేటాయించాలని మనవి చేస్తున్నాను.

ఇంకొక విషయము. దేశములో జనసంఖ్య చాలా హెచ్చుగా పెరిగిపోతోంది. ఇది ప్రభుత్వం అందరూ గుర్తించవలసిన విషయము. ఈ విషయములో కొంతవరకు జనసంఖ్యను అరికట్టేదానికి birth control ప్రవేశపెట్టాలి. దానికి ఒక ప్రత్యేక శాఖను ప్రచారశాఖఅనండి దాన్ని ఒకటి ఏర్పాటుచేసి దాని విషయములో ఎక్కువగా ప్రజలకు ప్రబోధించాలని కోరుతున్నాను. నర్సుల విషయం లక్ష్మణదాసుగారు చెప్పారు. Male nursing orderly system పోవాలి. నర్సులు సాధారణంగా స్త్రీలుగా వుంటే రోగులను చక్కగా పోషించడానికి వీలు వుంటుంది. Male nursing orderlies ను రద్దుచేసి నర్సులను ఎక్కువగా నియమిస్తే వారు రోగులను బాగా చూడడానికి వీలుంటుంది. వీరి వేతనాలు చాలాహీనంగా వున్నాయి. కాబట్టి వారిపరిస్థితులను కొంతవరకు చక్కబెట్టితే ఎక్కువ లాభం కలుగగలదు. Male nursing orderlies ను మాత్రం abolish చేయాలి అని కోరుచున్నాను. ఇంకొక విషయం జిల్లా Headquarters ఆసుపత్రులలో అనంతపురం జిల్లా Headquarters ఆసుపత్రిగురించి చెప్పదలచుకున్నాను. ఇది అన్నిజిల్లాలలో కంటే చాలాహీనంగావున్నది. డాక్టర్లకొరత కాదు. ఆసుపత్రి ఆరోగ్యకరమైన ప్రదేశంలోలేదు. Slums లో వున్నది. ఎన్నిసార్లు గానో విజ్ఞప్తులు చేసాము. ఇంకొక ఆరోగ్యకరమైన ప్రదేశంలోనికి మార్చవలెనని చెప్పాము. దానివల్ల చాలాయిబ్బందులు కలుగుతున్నాయి. సరియైన చోటవుంటే చాలామందికి చాలా ఉపయోగకరముగా వుండేది. Recruits School లోనికి మార్చవచ్చు. మేము కూడా కొంతవరకు మంత్రిగారికి సూచనలు యిచ్చాము. ఈ బడ్జెటులో ఆ విషయమై ఏలాంటి మొత్తాన్ని కేటాయించలేదు. ముఖ్యంగా మంత్రిగారు ఈ విషయాన్ని ఆలోచించి అనంతపురం Headquarters ఆసుపత్రిని అక్కడనుంచి తరలించి మరొక ఆరోగ్యకరమైన ప్రదేశానికి మార్చాలి అని విజ్ఞప్తి చేస్తూ, ఇంతటితో నేను విరమిస్తున్నాను.

* Sri M. KUNE RAO: —అధ్యక్షా, ముఖ్యంగా, ఈ వైద్య సహాయం, లక్ష్మణదాసుగారు చెప్పినట్లు గుమ్మడి సుబ్బారెడ్డిగారు చెప్పినట్లు గ్రామ ప్రాంతాలలో ప్రతి ప్రజానీకానికి అందుబాటులో లేకుండా పోతుంది. ఎక్కడో నెల్లూరు, విశాఖపట్నం మొదలైన ముఖ్యపట్టణాల్లో లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టి పెద్దపెద్ద ఆసుపత్రులు కడుతున్నారు. గ్రామ ప్రజానీకానికి వైద్య సహాయము జరగడంలేదు. మా నియోజక వర్గం చింతలపూడిలో తాలూకా Headquarters ఆసుపత్రి లేదు. రూరలు ఆసుపత్రి మాత్రం పెట్టారు. ఇవి జిల్లాబోర్డుల యాజమాన్యమున నడుస్తున్నాయి. జిల్లాబోర్డులను వచ్చిన ఆదాయం సద్వినియోగం చేయక దుర్వినియోగం చేసి, ఈ రోజున డబ్బు లేదని అసలే తను, వగా వైద్యసౌకర్యములున్న చింతలపూడి తాలూకాలో ఈ rural dispensaries ను close చేయడం జరుగుతోంది. ఈ చింతలపూడి తాలూకాలో నరసాపురం గ్రామములోవున్న సంగతియూ, రూరలు డిస్పెన్సరీలు ఎత్తివేసే సూచనలు వున్నాయి అని చెప్పారు. బుర్రంపాలెంలో కనీసం ఒక రూరలు డిస్పెన్సరీకూడా లేదు. ఎన్నో కాలం నుంచి కనీసం రూరలు డిస్పెన్సరీ అయినా పెట్టవలసిందిగా ప్రజలు కోరుచున్నారు. ఇంతవరకు ఏమీలేదు. ఇవిఅన్నీ చేయుటానికి ప్రభుత్వానికి డబ్బులేదు అంటున్నారు. ముఖ్యంగా మా టంగుటూరు గ్రామములో గారపాటి హైమావతమ్మగారు లక్ష రూపాయలు ఖరీదుచేసే బిల్డింగు దానం చేసారు. Compounder, Doctor అందరూ ఉన్నారు మందులు మాత్రంలేవు. ఇదివరకు గ్రామములో ఒకరిద్దరు నాటు వైద్యులు ఉండేవారు. ఈ హాస్పిటలు వచ్చిన తరువాత వారి practice పండి, క్రొత్త Hospital కు వెళ్ళేవారి సంఖ్య 100, 125 వరకు సగటున మొదట్లో వుండా వుండేది. కాని [illegible] 25 వరకు వెళ్ళే వారి సంఖ్య తగ్గిపోయింది. ఎందువలన వచ్చేవారి సంఖ్య తగ్గిపోయింది అని అడిగితే, డాక్టరు మందులులేవు అన్నాడు. ఒక స్త్రీని ఒక గేదె పొడిచింది. సల్ఫానిమేటు పౌడరు కావాలి దానికి ఆ powder కూడాలేదు హాస్పిటల్ లో. ఆసుపత్రికి ఎందుకు వెళ్ళటంలేదు అంటే అక్కడసరిగ్గా చూడడంలేదు అన్నారు. డాక్టరు దగ్గరకువెడితే Powder లేదు అన్నారు. కాగితం మీద వ్రాసియిస్తే తీసుకువచ్చినతరువాత

వైద్యం చేయుటం జరిగింది. ఈ విషయాలన్ని మంత్రిగారికి గవర్నమెంటు వారికి తెలియబరిస్తే బాగుంటుందని నన్ను అడిగారు. లక్ష జనాభాగల మా చింతలపూడి తాలూకాకు సరియైన వైద్యసహాయమే లేకపోతోంది. గత సంవత్సరం మలేరియాతోను ఈ సంవత్సరం తోలనేరి తరువాత తూటికూర, గన్నేరుగింజ, అవి తినడంచేత కలరావస్తే injection యివ్వడానికైనా గతిలేకపోయింది. ముఖ్యంగా హరిజనపల్లెలలో మాలమాదిగలు చనిపోవడం జరిగింది. ప్రస్తుతంవరంలో 30 మంది కలరావల్ల చనిపోయారు. లక్షలాది రూపాయలు బడ్జెటులోపెట్టి ఇవి చేస్తున్నాం, అవి చేస్తున్నాం, అంటే వైద్య సహాయము యెవ్వరికి అందదు. ముఖ్యంగా పేదలైన వ్యవసాయ కూలీలు కష్టపడుతున్నారు. కాబట్టి వ్యవసాయ కూలీలలో నుంచి వచ్చిన సంజీవయ్యగారు వీటిని తప్పకుండా పరిష్కరిస్తారని, రూరల్ ప్రాంతాలలో ఎక్కువగా ఆసుపత్రులుస్థాపించి 90% ప్రజానీకానికి వైద్యసహాయం అందుబాటులో వుండేటట్లు చేస్తారని కోరుచున్నాను. మిగతా 10 Headquarters ఆసుపత్రికి వెళ్ళగలుగుతారు. మా చింతలపూడి తాలూకాకు Headquarters ఆసుపత్రి ఏర్పరచి, ప్రతి ఫిర్కా కేంద్రాలలోను రూరలు ఆసుపత్రులు స్థాపించి మందులు సక్రమముగా supply చేస్తారని కోరుతూ నేను విరమిస్తున్నాను.

Sri R. B. SUDARSANA VARMA:— అధ్యక్షా! ఈ మెడికల్ డిమాండుమీద కోతతీర్మానాన్ని ప్రతిఘటిస్తూ గవర్నమెంటు వారికి కొన్ని సూచనలు చేయడానికి ప్రయత్నిస్తున్నాను. నా ప్రధాన సూచన ఏమిటంటే, తాలూకా Head quarters లో ఉండే ప్రతి ఆసుపత్రిని provincialise చేయాలి అని. ఇవి చాలా చోట్ల జిల్లాబోర్డుల స్వాధీనంలో వున్నవి. జిల్లాబోర్డుల పరిస్థితులను గురించి మనం చర్చించుకొనే వున్నాము. ఈ భారాన్ని జిల్లాబోర్డులనుంచి తొలగించడానికి గవర్నమెంటు సక్రమంగా 5 ఏళ్ళలోపుగా ఒక స్కీము తయారుచేసి తాలూకా కేంద్రాల్లో వుండే ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటే మందులు, శస్త్రపరికరాలు అభివృద్ధిపరచి, అవి ఎక్కువ ఉపయోగకరంగా వుండడానికి వీలువుంటుంది. త్వరగా యీ స్కీములు అమలు పరచవలసిందిగా కోరుచున్నాను.

Sri R. B. Sudarsana Varma] [19th March 1954

అనేక గ్రామాలలో వైద్యుల సలహా లేదు. అంతా బస్తీలకే సరిపోతుంది. గ్రామాలలో వైద్యసహాయం లేదని మిత్రులు చెప్పినారు. దానితో నేను ఏకీభవించుచున్నాను. రూరల్ డిస్పెన్సరీల స్కీము వచ్చిన తరువాత మరి అధ్వాన్నముగావుంది. సరియైన సబ్సిడీ ఇవ్వకపోవడంవల్ల డాక్టర్లు రామంటున్నారు. ప్రైవేటు ప్రాక్టీసువల్ల ఎక్కువలాభమని బస్తీలకు పోతున్నారు. గ్రామాలలో వైద్యసహాయము కావాలంటే ముందు డిస్పెన్సరీకి సబ్సిడీలు ఎక్కువ చెయ్యవలెను. నా చుట్టు మా గుప్పం బహుగ్రామములో ఆసుపత్రికి డాక్టరు లేకుండా చాలా కాలము నుంచి వుంది. ఎవరు వచ్చే అవకాశం లేదు. పది మైళ్ళదూరములో వున్న తిరుపతిలో ప్రాక్టీసు చేస్తే ఎక్కువ ధనము వస్తుంది అందుచేత ఎవరూ రావడం లేదు. ఈ స్కీమును తక్షణమే అమలు జరిపితేనేగాని గ్రామాలకు వైద్య సహాయము అందదని నేను చెబుతున్నాను.

కంపోజిటు రాష్ట్రంలో విలేజి వైద్యాస్ అని ఆరు నెలల ట్రైనింగు ఇచ్చేరు. వారు ఎక్కడ వైద్యం ప్రాక్టీసుచేస్తున్నారో తెలియదు. వారికి కూడా సబ్సిడి ఇచ్చి గ్రామాలలో వుంచితే బాగుంటుంది. ఏదో అలోపతి కాకపోతే హోమియోపతీలోనైనా వైద్యసహాయం చెయ్యడానికి అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ Village Vaidyas Training వృథా కాకుండా వారిని ఈ రూరలు డిస్పెన్సరీలలో అపాయింటు చేయవలసినదని నేను కోరుతున్నాను.

ఇక మెడికలు కాలేజి ఆవశ్యకత చాలావున్నది. మద్రాసు రాష్ట్రములో 2, 3 చోట్ల మెడికలు కాలేజీలు వున్నవి. మన రాష్ట్రానికి ఒక్క విశాఖపట్నంలోనేవున్నది. మరొకటివుంటే మంచిది. కాబట్టి మదనపల్లిలో మరొకటి ఏర్పాటుచేస్తే బాగుండును. అక్కడ మంచి శానిటోరియము, హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రి ఉన్నవి, కాబట్టి మెడికలు కాలేజ స్థాపనకు ఎక్కువ అవకాశండుంది. వీటితో స్పెషలైజు చెయ్యవచ్చును,

L. I. M. కోర్సుకుగాను ఒక కాలేజి నిర్మిస్తామని తెన్నేటి విశ్వనాథంగారు బడ్జటు స్పీచిలో చెప్పేరు, కాని అందుకు ఏమీ మొత్తం కేటాయించినట్లు కనబడలేదు.

Sri K. RAMAYYA CHOWDARY:— అధ్యక్షా, ఇప్పుడు మన ఎదుటనున్న చర్చనీయాంశము అమిత ముఖ్యమైంది. ఇది ప్రజారోగ్యమునకు సంబంధించిన విషయము. వైద్య సహాయమును గురించి మాట్లాడుచున్నాము. అసలు వైద్యులు వైద్యమును గురించి మాట్లాడేముందు అసలు ఈ జబ్బులు ఎందుకు వస్తున్నాయో, కారణములు ఏమిటో ఫండమెంటల్ ప్రిన్సిపల్సు విచారించి వ్యాధి రాకుండా చేయవలయును. వచ్చిన జబ్బు బాగుచెయ్యడానికి డాక్టర్లు లేరు అని కొందరు అంటున్నారు ఈ వివరములను గురించి మాట్లాడడానికి ప్రతి సభ్యునికి 20 నిమిషములు టైము ఇవ్వవలెను అని కోరుచున్నాను.

ఆరోగ్యశాఖకు సంబంధించినంతవరకు పల్లెటూళ్ళను నిర్లక్ష్యం చేస్తున్నారని అందరు అంగీకరిస్తారు. కేంద్రీకృత పరిపాలన జరుగుతున్నది అని అనుమానం కలుగుతుంది. అనేక చోట్ల ధర్మ ఆసుపత్రి అని వ్రాసి యున్నది. ఈ బోర్డులలో 'అ' అన్న అక్షరము వ్రాయడం మరచిపోయినారని నాకు అనుమానముగావుంది ప్రభుత్వంవారు ఇప్పటికైనా ఆ 'అ' అక్షరాన్ని వ్రాయించాలి అని మనవి చేస్తున్నాను. జిల్లాబోర్డు ఆసుపత్రి డాక్టర్లకు స్వల్పముగా జీతాలు ఇస్తున్నారు. డాక్టర్లు దొరకడం కష్టంగా వుంది. Expert డాక్టర్లు లేరు. ఆసుపత్రిలలో మందులు లేవు. డాక్టర్లు ఉంటే మందులు, మందులు ఉంటే డాక్టర్లు ఉండరు. మందుల సప్లయి నామినేటుచేసిన కంట్రాక్టర్లకు ఇస్తారు. డాక్టర్లువెళ్ళి 90% మందుకు శాంక్షన్ చేస్తే 30% మందులు పుచ్చుకొని తక్కినవి క్యాషుగా తీసుకుంటారు.

మా నెల్లూరుజిల్లాలో ఈ మధ్య ఒక సంగతి జరిగింది. ఒకమనిషి పాముకరచి చనిపోయినాడు. పోలీసువారు శవాన్ని పరీక్షకు తీసుకొని వెళ్ళారు. ఆ సంగతి ముందుగానే తెలుసుకుని అక్కడి డాక్టరు అర్ధరాత్రి వేళ శెలవుతీసుకొని వెళ్ళిపోయినాడు. వైరు ఇచ్చేసేడట. ఇంకొక ఆసుపత్రికి వెళ్ళితే అక్కడ డాక్టరుకూడా ముందుగానే శెలవుపెట్టిపోయినాడన్నారు. మూడవరోజున శవపంచాయతి జరిగింది. రిటైరు అయ్యే డాక్టర్లను పండు వృద్ధులను జిల్లాబోర్డు ఆసుపత్రిలలో పెడుతున్నారు.

19th March 1954] [Sri Challa Subbarayudu

ఇటు మద్రాసు, బెంగుళూరు, హైదరాబాదులకు పోవలసిన అవసరం వస్తున్నది. కాబట్టి సెంట్రల్ స్థలాల్లో, మంచి స్పెషలిస్టులను ఉంచేటట్లుగా ఏర్పాటు చేస్తే, అన్ని ప్రాంతాల అవసరాలు తీర్చడానికి వీలుగా ఉంటుంది. మెడికల్ కాలేజీలు పెట్టడానికి గూడ ఇవి తోడ్పడుతవి. ఆసుపత్రులు అక్కడక్కడ పెట్టుతున్నారు. కాని అక్కడ మందులు బొత్తిగా లేవు. రూరల్ ఆసుపత్రులలోగాని Headquarters ఆసుపత్రులలోగాని, ఎక్కడాగూడ మందులులేవు. తాడిపత్రి Headquarters ఆసుపత్రి తీసుకుందాము. సరైనమంచాలు గాని, మంచములుగాని లేవు. మంత్రిగారు అక్కడికి tour వచ్చినప్పుడు ఈ ఆసుపత్రిని చూచి "ఇది ఆసుపత్రా? లేక బైరాగిమఠమా?" అని అన్నారు. దీనికి ఏవిధమైనటువంటి improvement యింతవరకు లేదు. ఆజిల్లాలో అది కేంద్రముగా ఉన్నది కాబట్టి ఆ చుట్టుప్రక్కల గ్రామాల వారు అక్కడికి రావటం, తటస్థిస్తున్నది. Lady Doctor గూడ అక్కడ లేదు. ఆ ఆసుపత్రిలో, మంచినీళ్ళకుగూడ కరువుగా ఉన్నది. అక్కడి రోగులకు మంచినీళ్లుగూడ దొరకటంలేదు. Electricity సదుపాయము గూడలేదు. ఇవన్నీ కల్పించాలని కోరుతున్నాను. మందులు యివ్వటములో చాలా ఆలస్యం జరుగుచున్నది. గంటలకొలది రోగులు అక్కడ వేచి ఉండవలసివస్తున్నది. ఇంకా ఇద్దరు కాంపౌండర్ను (compounders) వేయవలసినదిగా కోరాము. అదిగూడ జరుగలేదు. ఆసుపత్రులను పాడుపెట్టడముకంటే, మందులు వగయిరాలు ఏర్పాటుచెయ్యాలని కోరుతున్నాను. హోమియోపతి వైద్యము చేసేవారున్నారు. బొంబాయి U. P. రాష్ట్రాలలో హోమియోపతి వైద్యము చేసేవారికి, certificates యివ్వటం జరుగుతున్నది. వీరు ఇతర అల్లోపతిక్ వైద్యులవలె ప్రాక్టీసు చేయటానికి వీలులేకుండా ఉన్నది. వీరికిగూడా సర్టిఫికేట్లు యివ్వవలసినదిగా కోరుతున్నాము. ప్రకృతి వైద్యమును గురించి. భీమవరంలో ఒక రాజుగారు ఉన్నారు. వారిని పోలీసులు అటకాయించినట్లు తెలిసినది. ఒక bill ను పెట్టి, రికగ్నిషన్ చేయవలసి ఉన్నది. ప్రభుత్వం తక్కువ ఖర్చులతో ఎక్కువమందికి అవకాశం కలిగేలాగున చేయవలసి ఉన్నది. నరాల బలహీనత (beri beri) వ్యాధి ఎక్కువగా ఉన్నది. ఇది ఎక్కువగా మనం తినే బియ్యమువల్ల వస్తున్నది. మిల్లు

బీద్యంవల్ల, ఈ నరాల బలహీనత వస్తున్నది. దీనికన్న దంపుడు బియ్యం ఏర్పాటుచేస్తే ఈ వ్యాధి తగ్గటమే కాకుండా, నిరుద్యోగం, తొలగించినట్లుగా కూడా అవుతుంది. అట్లా వీలు లేకపోతే, బియ్యమును పూర్తి పాలిష్ చేయకుండా ముడిగా వుండేటట్లయినా చేస్తే ఈ రోగాలనుండి తప్పుకోడానికి వీలుగా వుంటుంది. మా తాలూకాలలో మలేరియా ఎక్కువగా ఉన్నది. చాలా గ్రామాలు సర్వే చేశారు. దాని నివారణకు తగుచర్య తీసుకోవాలి. తాడిపత్రి వగయిరా గ్రామాలలో విపరీతముగ బాధపడుతున్నారు. గ్రామాలు వదలిపెట్టి వెళ్ళే దౌర్భాగ్యం వచ్చింది ఈ సంవత్సరం budget లో దానికిగాను, ఏమైనా కేటాయించారో, లేదో, నాకు తెలియటంలేదు. వీటిని గురించి గట్టి శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. గినివర్మ్ (నారికురుపు) ఈ ప్రాంతములలో ఎక్కువగా ఉన్నది. దానికి మందులేకుండా ఉన్నది. దీనిని పరిశోధన చేసిన వారు తగిన మందును కనుక్కున్నారో, లేదో, తెలియటంలేదు. డాక్టర్లు తగిన శ్రద్ధతీసుకోవాలని కోరుతున్నాను. వైద్యంలో మంచి సౌకర్యములు చేయాలని కోరుతూ, అధ్యక్షులవారు ఈ అవకాశము యిచ్చినందులకు వందనములు తెలుపుతూ ముగిస్తున్నాను.

(At this stage Mr. Speaker occupied the Chair.)

Sri T. LAKSHMINARAYANA REDDI:— అధ్యక్షా. ఈ demand చాలా ముఖ్యమైనది. ఈనాడు ప్రభుత్వం చేస్తున్న సహాయం ఎంత వరకు ప్రజలకు అందుతున్నదో విచారించాలి. అనంతపురంలోని ఆసుపత్రి తీసుకుంటే, ఇది సరియైన స్థలములో లేదని, మంచిస్థలములోనికి మార్పు చేయడానికి త్వరగా ఏర్పాటు చేయమని-ప్రజలు చాలా యిబ్బందులు పడుతున్నారని చెప్పాము. పోలీసు ఆసుపత్రి అనంతపురం పట్టణ మధ్యనవున్నది. దానిలో పౌరులకుకూడా వైద్యసహాయము లభించునట్లు చేయించమని ప్రజలకు అందు బాటుగా వుంటుందని మంత్రిగారు అక్కడకు వచ్చినప్పుడు చెప్పాము. ఉత్తరువులుయిస్తామనిచెప్పారు. ఆవిధంగా జరగడానికి ఉత్తరువులు యివ్వవలసినదిగా కోరుచున్నాను. ఆసుపత్రులలో లంచగొండితనము ఏవిధంగా సాగుతున్నదో మీకు కూడా తెలుసును అనంతపురము ఆసుపత్రిలో నరశింహులునాయుడుగారు లంచము తీసుకొన్నారు. ఇది ప్రభుత్వానికి తెలుసును. అర్జీలుగూడ విచారించారు.

దీనిమీద ప్రభుత్వం ఏమిచర్య తీసుకొన్నదీ తెలియదు. అనంతపురం ప్రజల లో ఇది ఆందోళనగావున్నది. దీనిని కొన్ని పరిస్థితులలో శ్రీ సంజీవయ్య గారు ఏదో విధంగా జరగనియకుండా చేయాలనే దృష్టిలోవున్నట్లుగా తోస్తున్నది. ఆ డాక్టరు మంచివాడని చెప్పేవారు ఎవరైనావుంటేసవాల్ చేస్తున్నాను. జరిగిన వాటిని prove చేస్తాను. కాబట్టి ప్రభుత్వాన్ని యీ విషయంలో ప్రోత్సహించగలరని సలహా యిస్తున్నాను. ఈనాడు తాలూకా ఆసుపత్రులు తీసుకుంటే-పెనుగొండ ఆసుపత్రి-కృష్ణదేవరా యల చెరశాలగా వున్నది. ఒక్క lady-doctor గూడ లేదు. చాలా మంది రోగులు ఆ అసుపత్రికి పోతున్నారు అక్కడ ఆసుపత్రిని అభివృద్ధి లోనికి తెచ్చి-అక్కడ ఒక Lady-Doctor'ను వేయమనిచెప్తున్నాను ఒక్క పెనుగొండ తాలూకా గాక జిల్లాలోని అన్ని తాలూకా ఆసుపత్రులను అభివృద్ధి చెయ్యాలని కోరుతున్నాను. ఇతర దేశాలు యీ Health ను గురించి బాగుపడుతున్నాయి కాని మనం ఆవిధంగా అభివృద్ధి చేసుకోలేకపోతున్నాము. బుక్కపట్నం ఆసుపత్రి తీసుకుంటే - అక్కడ ఎంతో ఖర్చు అవుతున్నది. రు. 2000 లు ఖర్చవుతున్నది. అందులో 1400లు వైద్యసహాయానికని మెడికల్ ఖర్చులకు పోతుంది.

ఈ మెడికల్ demand విషయంలో ప్రజలకు ఎంత అందుతున్నది మాకు తెలియకున్నది.

మంత్రిగారి ఉపన్యాసములో వచ్చే సంవత్సరం మనరాష్ట్రములో Mobile hospitals పెట్టుచున్నామని చెప్పారు, ఎక్కువగా ప్రతి జిల్లాలోను కూడ పెట్టగలుగుతున్నారని వాటిద్వారా కొద్దివారైన ప్రజలకు వైద్యసహాయము అందజేస్తారని ఆశిస్తున్నాము. ప్రత్యేకంగా క్షయవ్యాధికి మా జిల్లా కేంద్రములో ఇచ్చేటటువంటి వైద్య సహాయము చాలా తక్కువ. రాయలసీమలో ఒకే ఒకచోట మదనపల్లిలో ఈ Sanitorium ఉన్నది. దానిని Mission వాళ్లు manage చేస్తున్నారు. మన గవర్నమెంటు దానికి సహాయము చేస్తున్నది. దాంట్లో seat దొరకాలంటే చాలా కష్టము. పెద్ద పెద్ద ఉద్యోగస్తులకే ప్రవేశము చాలా కష్టంగా ఉంటుంది ఇక సాధారణ ప్రజల సంగతి చెప్పనవసరంలేదు. కాబట్టి క్షయతో బాధ పడేటటువంటివారికి ప్రత్యేకంగా ప్రతిజిల్లా కేంద్రములోను

మదనపల్లిలో ఏ విధమైన సౌకర్యమున్నదో అటువంటి వైద్యసహాయము కలుగ జేయవలెనని కోరుచున్నాము. ముఖ్యంగా ఈ కాలములో ప్రజలకు ఆహారలోపమువల్లను ఇతర కారణాలవల్లగూడా రోగనిరోధక శక్తి తగ్గి పోతున్నది. యువకులకు కూడ చాలామందికి ఈవ్యాధి వస్తున్నది కనుక దీనిని నివారించడానికి ప్రభుత్వము అన్నివిధాలా తోడ్పడవలసియున్నది.

తరువాత కుష్ఠువ్యాధి గురించి కూడ ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసి యున్నది. సాధారణాగా ఈకుష్ఠురోగులు ఈవేళ బజార్లలో ఉంటున్నారు. ప్రభుత్వము ఈకుష్ఠురోగులయొక్క లెక్కలు తీసి వెంటనే వీరికి ఒక ప్రత్యేకమైన Hospital ఏర్పాటుచేసి ఈవ్యాధి ఇతరులకు అంటుకోకుండా వీరికి ప్రత్యేకమైనటువంటి ఏర్పాటుచేస్తే బాగుంటుందని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తున్నాను నిజముగా ప్రజలకు రోగములు రాకుండా చేయాలంటే సరియైన ఆహారము అవసరము. ఈనాడు పల్లెటూళ్ళలో కొందరు మిత్రులు చెప్పినట్టుగా తినుటకు తిండికూడ సరిగా లేకుండా బాధపడుతున్నారు. ఆహారానికి ఆరోగ్యమునకు చాలా సంబంధమున్నది కనుక ప్రభుత్వము కేవలము వైద్య సదుపాయాలు కలుగ జేయడమే కాకుండా వారియొక్క జీవనాధారాన్ని జీవితపరిమాణాన్ని హెచ్చించడానికి ప్రయత్నం చేయాలి. ముఖ్యంగా కూడా రాయలసీమ క్షామప్రాంతము ప్రజలకు తినుటకు సరిగా తిండిలేదు. తిండి లేనందువల్లనే అనేక రోగాలకు గురి అవుతున్నారు కనుక వీరికి అన్ని విధాలా ప్రభుత్వము తోడ్పడవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

Sri KAVALI NARAYANA:—అధ్యక్షా! ఇక్కడ ఉన్నటువంటి సభ్యులందరు ఈ Medical department గురించి, వైద్యము గురించి చక్కగాచెప్పారు, చాలా సంతోషము. సాధారణంగా మన అనుభవంబట్టిచూస్తే, పెద్దవాళ్ళకు, యిష్టము వచ్చినట్లు తిండి తింటూ సుఖంగా వుండేవాళ్ళకే రోగాలు వస్తున్నాయిగాని, బీదలకు తిండి చాలి చాలక, ఆహారము ఉండినా లేకపోయినాసరే అనేటటువంటివాళ్లకు రోగాలు రావు. ఇప్పుడు ప్రభుత్వము కలుగజేసిన వైద్యసదుపాయాలు ఈ డాక్టర్లు పెద్దవారికి ధనవంతులకే ఉంటున్నదిగా, బీదవారికి కాదు. ఈ డాక్టర్లు చేసే చికిత్సకూడా ఏమాత్రం తృప్తికరంగాలేదు. చిన్న, పెద్ద, ధనవంతులు, బీదవారు అనే పక్షపాతము చాలా చూపుతారు. పల్లె

19th March 1954] [Sri Kavali Narayana

టూళ్ళలో నాకు అనుభవమున్నది. మా ప్రాంతములో ఒక కాపురైతు మల్లయ్య అనేఅతను, పాలకొండ తాలూకా, కర్నాయుడుపేట అనే గ్రామంలో పెద్ద పెద్ద వైద్యులు, డాక్టర్లు బాగుచెయ్యలేని స్త్రీలజబ్బులు చిన్న మూలికలతో బాగుచేస్తున్నాడు. పెద్ద ఆసుపత్రులకు పోతే బాగా తుందని అనుకొనేవారు అనుదినంపోయి ఆ పెద్దబిల్డింగులలో చికిత్స తీసుకొంటూ ఇంజెక్షన్లు ఆపరేషన్లు, చేసుకొని డబ్బుఖర్చుచేసుకొని తుదకు ప్రయోజనము లేకుండా వెనుకకురావడం జరుగుతున్నది. కాని రోగులు బాగు కావడంలేదు. అసలు యీ డాక్టర్లకు ప్రజలమీద యేమాత్రం విశ్వాసముండదు. వారికి కావలసిందల్లా డబ్బు. డబ్బున్నంతవరకే చికిత్స జరుగుతుంది. గ్రామాలలో ఉన్నటువంటి ఆయుర్వేద వైద్యులు చాలా మంది ప్రజలవద్ద డబ్బుపుచ్చుకోకుండా విశ్వాసముతో బాగుచేస్తారు. వైద్యుల అనుభవము, వకీళ్ళ అనుభవము ఒకటే విధంగా ఉంటుంది. పెద్ద పెద్ద కోర్టులలో practice చేస్తున్నటువంటి వకీళ్ళు అబద్ధాలు చెప్పనిదే వాళ్ళకు గిట్టదు. ఈ డాక్టర్లకు డబ్బుతీసుకొని ఇంజెక్షన్ ఇవ్వడం అపరేషన్లు చేయడంతప్ప మరేమీ తెలియదు. ఒక Engineering Department లో ఒక Engineer ఈమధ్యన మా గ్రామంలో "వరివృక్షాలు ఏలాఉంటాయి అని" అన్నాడు. ఆవిధంగాఉంటుంది. కనుకనే డాక్టర్లకు అనుభవముండాలి. ఇప్పుడు Hospital లో ఇక్కడ ఉమ్మకూడదు, అక్కడ ఉమ్మవలెను, అని వ్రాసి వుంటుంది. కాని అక్కడనే విశేషముగా ఉమ్మివేస్తారు. బస్సులలో పొగత్రాగకూడదని వ్రాసిఉంటే అక్కడనే బాగుగా అక్కడనే త్రాగుతారు. ఇదే విధంగా సినిమాహాల్సులోకూడా పొగతాగకూడదని బోర్డులు వేసివుంటారు. కాని అక్కడనే ఎక్కువగా సిగరెట్లు పీలుస్తారు. దీనిబట్టిచూస్తే హృదయ పరివర్తన లేనిదే మనష్యులు బాగుపడరు. దేశ సౌభాగ్యాన్ని బాగుచేయడానికి కంకణ బద్ధులైన ఈ ప్రభుత్వము సక్రమమైన పద్ధతిలో నడచుకోనప్పుడు ప్రజల యొక్క సహకారం లభించదు. ప్రజలకుకూడా వారివల్ల ఏమి ప్రయోజనముండదు. ప్రజమీద నిజమైన విశ్వాశముకలిగి వారికి వైద్య సౌకర్యము కలుగచేయవలెనంటే ఆయుర్వేదము చదువు కొన్నటువంటి వైద్యులకు స్వల్ప వేతనాలు ఇచ్చి 30, 40 రూపాయాలు (50 రూపాయల లోపుగా) ఇచ్చి ప్రతి పది గ్రామాలకు ఒక ఆయుర్వేద వైద్యుణ్ణినియమిస్తే బాగుంటుందని మనవి చేస్తు

Sri Kavali Narayana] [19th March 1954

న్నాను. ఇప్పుడు ఏదో 150, 200 రూపాయలిచ్చి డాక్టర్లను పెట్టినందు వల్ల గ్రామాలలోని ప్రజలకు, బీదవాండ్లకు ఏమి ప్రయోజనం జరగడం లేదు. లక్షలాది ప్రజలు పేదవాళ్ళుంటారు. వీరందరికి ఏలాంటివైద్య సహాయం అందడంలేదు. పల్లెటూళ్ళలో ప్రజలు యేవిధంగా బాధపడు తున్నారో ఈ ఆఫీసర్లకు అర్థంకావడంలేదు. సు. మిక్కడ పంకాలక్రింద కూర్చొని హాయిగావుంటే, గ్రామాలలో ప్రజలు అక్కడ దోమలతో బాధపడుతూ యుంటారు. వారికష్టాలు మనకు తెలియవు.

తరువాత గ్రామాలలో చుట్టుప్రక్కల చిన్న చిన్న బావులలో గోగునార వేయడమువల్ల, ఆ నీరు త్రాగుటచేత, కొన్నికొన్ని రోగాలు వస్తూ ఉంటాయి. ఈ విషయములలో నేను అక్కడ గ్రామములసభు లకు ఈ విధముగా చేయకూడదు, ఇది తప్పు అని ప్రచారముచేశాను. కనుక ప్రజలలో హృదయపరివర్తన కలగనిదే ప్రయోజనముండదు. మొత్తానికి బీదవాళ్ళకు, హరిజనులకు ఏలాటి వైద్య సౌకర్యములేదు. డిస్ట్రిక్టుబోర్డు డిస్పెన్సరీలు వచ్చాయి. కాని ఈ డిస్ట్రిక్టుబోర్డు వ్యవహారా లన్నీ నాకు బాగా తెలుసును. ఈ ప్రెసిడెంట్లు, మెంబర్లు ఎప్పుడూ ఈ టీచర్లను పీడిస్తూయుంటారు, వారి స్వలాభాలే ఎప్పుడు చూచుకొంటూ యుంటారు. వాళ్ళ పిల్లలకు ట్యూషను ఇవ్వకపోయినా, వారి మాట వినకపోయిన వేరేచోట్లకు ట్రాన్సుఫర్ చేయడం మొదలగు కష్టాలు పెడుతూయుంటారు. కనుక అటువంటివారి మేనేజిమెంటు క్రింద ఉండే ఈ dispensaries వల్ల కూడా ఏమి ప్రయోజనములేదు. అక్కడ మందులుగూడ సరిగా ఉండవు. కనుక ముఖ్యంగా ఈ ఆఫీసర్లలోగాని, డాక్టర్లలోగాని, ప్రజలలోగాని, అందరిలోను హృదయ పరివర్తన కలగ నిదే పరిస్థితులు బాగపడవు. ప్రజలకు సరిగా వైద్యసహాయం జరగా లంటే ముఖ్యముగ ఈవైద్యులలో హృదయ పరివర్తన ప్రజలపట్ల విశ్వా సము చాలా అవసరము. శ్రీకాకుళంలో ఆయుర్వేదము చక్కగ చదువుకొన్నటువంటి ఈశ్వర సత్యనారాయణ అనే వైద్యులున్నారు, ఆయనకు నేను శిష్యుడుకూడాను.

(Mike disconnected by the Hon. Speaker, as the Hon. Member's time was over.)

పరిస్థితులలో తాత్కాలిక సహాయముకూడా దొరకదు. ఏదైనా వైద్య సహాయము కావలసియుంటే నూరుమైళ్ళ దూరములోవున్న బెజవాడ, నూజివీడు, హాస్పిటళ్ళకు-వెళ్ళవలసి వుంటుంది. భాగ్యవంతులు ఎంత ధనమైనా ఖర్చుపెట్టి దూరమైనా పోగలుగుతారు కాని డబ్బులేనివాళ్ల యొక్క దుస్థితియేమిటో, వీళ్ళకు వైద్యసహాయం ఏవిధంగా లభిస్తుందో ఆలోచించండి. కనుక సామాన్య ప్రజలకు వైద్యసహాయం యేవిధంగాను లేదనే విషయము ప్రభుత్వము గుర్తించాలి. తిరువూరు హాస్పిటలులో కొత్తగా ఒక మెటర్నిటి వార్డుకు, ప్రజా సహకారంతో జిల్లా వెల్ ఫేర్ కమిటీ కట్టించింది. ఆ కమిటీకి జిల్లా కలెక్టరు అధ్యక్షులు. మంత్రి పట్టాభిరామారావుగారు ఆ వార్డుకు 1952 లో ప్రారంభోత్సవము జరిపారు. కాని ఆ హాస్పిటలులో లేడి డాక్టరును యింతవరకు వేయలేదు. మందులుగాని, beds గాని యేర్పాట్లు చేయలేదు. ఆఖరుకు ఒక సీనియరు నర్సునుగాని, Head nurse ను గాని వేయలేదు. తాలూకా కేంద్రములోవున్నదని చెప్పబడే హాస్పిటలులో స్త్రీలకు ఎటువంటివైద్యం లేదు. డాక్టరునుకూడా యీ హాస్పిటలులో వేయలేదు. హాస్పిటల్సులో యిటువంటి పరిస్థితులు వుంటున్నవి.

ఇకపోతే Rural Dispensaries విషయం చెప్పనవసరములేదు. గంపలగూడెంలో ఒక రూరల్ డిస్పెన్సరీ పెట్టారు. అక్కడ వుంటున్న డాక్టరుకు క్షయ రోగము రావడమువల్ల 8 నెలలు శెలవులో వెళ్ళాడు. 8 మాసములైనను వేరే డాక్టరును వేయలేదు. డిస్పెన్సరి తెరువకుండా 8 మాసములు మూసివేసి వున్నది. Firka development scheme క్రింద మా తాలూకాలో రెడ్డిగూడెం అనే గ్రామంలో క్రొత్తగా ఒక Dispensary పెట్టారు. డాక్టరుమాత్రం వున్నాడు గాని మందులకు డబ్బు గ్రాంటుకాలేదు. ఇంతవరకు మందులు రాలేదు. మైలవరంలో వున్న L. F. హాస్పిటలు డాక్టరు లేకుండా సంవత్సరకాలం మూసివేయబడినది. ఈ హాస్పిటలు విషయములో వుమ్మడి మద్రాసు రాష్ట్రము వున్నప్పుడు అసెంబ్లీలో నేను ప్రశ్నలువేస్తే, మాకు ఆవిషయము తెలియదు అని అప్పటి మంత్రిగారు సమాధానం యిచ్చారు. కాబట్టి యీ హాస్పిటలు మేనేజిమెంటు, వైద్య సహాయము సక్రమముగా జరగడము

19th March 1954] [Sri P. Rama Rao

లేదని మంత్రిగారు గుర్తించాలి. జిల్లాబోర్డు ఆధీనంలోని హాస్పిటల్సులో డాక్టర్లకు చాలా తక్కువస్కేల్సు యిస్తారు. అందువల్ల డాక్టర్లు ఎవరు కూడా రావడములేదు. వారికి ప్రభుత్వ స్కేలు ప్రకారం జీతాలు యిచ్చి వారు సక్రమంగా పనిచేసేటట్లు చూడాలి. వారి ప్రయివేటు ప్రాక్టీసు రద్దుచేయాలి. వాళ్ళకు జీతాలు 50 రూపాయలు, 60 రూపాయల కంటె జిల్లాబోర్డువారు ఎక్కువ యివ్వరు. వీలుఅయితే ప్రయివేటు ప్రాక్టీస్ చేసుకొమ్మని అంటారట. అటువంటప్పుడు ఎవరైనా రోగి హాస్పిటలు వద్దకు వెళ్ళితే ఆ డాక్టరు అక్కడ వుండరు. ఎంతసేపు కూర్చున్నప్పటికినీ డాక్టరు కనబడరు. ఎక్కడికి వెళ్ళాడు అని అడిగితే, ఆయన ఎక్కడికో రోగినిచూడటానికి వెళ్ళాడు, ఎప్పుడువస్తాడో తెలియదని సమాధానం వస్తుంది. నిజంగా రోగికొరకు వెళ్లాడో, యింట్లోనే వున్నాడో, వేరే స్వంతపనిమీద వెళ్ళాడో ఎవరికెరుక! గనుక వీరు హాస్పిటలుకు కూడా రాని పరిస్థితులు కూడా వుంటున్నవి. కాబట్టి ఈ పరిస్థితులన్ని ప్రభుత్వంవారు దృష్టిలో పెట్టుకొని ప్రతి తాలూకా కేంద్రాలలో వున్న హాస్పిటలును ప్రభుత్వం వెంటనే స్వాధీనపర్చుకొని సక్రమంగా నడపవలెను. రెండు, మూడు, మొబైలు వానులు సప్లయిచేసి గ్రామాలకు కూడావెళ్లి వైద్య సహాయం అందేటట్లుగాచేస్తే ప్రజలకు సౌకర్యముగా వుంటుంది గనుక ప్రభుత్వము యీవిషయములో తగుశ్రద్ధ వహించి చర్య తీసుకొంటారని ఆసిస్తూ విరమిస్తున్నాను. ప్రతిజిల్లాకు అంబులెన్సుకారును యేర్పాటు చేయవలసినదిగా కోరుచున్నాను.

Sri K. VEERANNA PADAL:—అధ్యక్షా, మన రాష్ట్రములో వైద్యసహాయమునుగురించి ప్రభుత్వంవారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ కొన్నిసూచనలు చేయదలచుకున్నాను. ప్రభుత్వము వారు ఏర్పరచిన హాస్పిటల్సుగాని, డిస్పెన్సరీలుగాని మొబైల్ వానులు గాని యేర్పాటుచేయించి మా ఏజన్సీ ప్రాంతములో వైద్యసహాయము చేయించవలెను. మాఏజన్సీ ప్రాంతము 1800 మైళ్ళ విస్తీర్ణముగలది. సముద్రమట్టమునకు మూడువేలఅడుగుల ఎత్తునవున్నది. అక్కడ అంతయు కొండలు, అడవులువున్నవి. అక్కడవుండేది కొండజాతివారు. ఏ విధమైన వైద్య సహాయము లేక ఆప్రాంతపు ప్రజలకందరికి-రోగములు వచ్చుచున్నవి. వైద్యసహాయం కావలసివుంటే ఎన్నోమైళ్ళు నడచిరావాలి. పైగా

Sri Veeranna Padal] [19th March 1954

రోడ్లుగూడా అంతంత మాత్రమే. బ్రిటీషు సామ్రాజ్యములో కొద్దిరోడ్లు వేసినారు. మా ప్రభుత్వం వచ్చిన తరువాత ఒక రోడ్డుగూడా వేయించలేదు. వైద్యసహాయం ఏజన్సీప్రాంతాలకు అందుబాటులో లేదు. గూడెంతాలూకాలో మాత్రం ఒక హాస్పిటలు ఏర్పాటుచేశారు. మా ప్రాంతాలలో మలేరియా న్యూమోనియా మొదలైన జ్వరములతో ఆ ప్రాంతపుప్రజలు ఎక్కువగా బాధపడుతూ వుంటారు. నేను ఎప్పుడు మాట్లాడినా మా ప్రాంతపు ప్రజలకు వైద్యసహాయము విషయము మాట్లాడుతూనే వున్నాను. ప్రభుత్వం ఏవిధమైన శ్రద్ధవహించుచున్నట్లులేదు. మా ఏజన్సీ ప్రాంతాలలో నిమోనియా మొదలైన జ్వరాలు కాకుండా, యాస్ అనే జబ్బు ప్రబలంగావుంటున్నది. ప్రభుత్వమువారు ఈజబ్బుకు మందులు కనిపెట్టి సప్లయిచేయించాలి. ప్రజలు చాలాబాధపడి చనిపోతూవుంటున్నారు. ప్రభుత్వమువారు శ్రద్ధవహించి మా ఏజన్సీప్రాంతాలకు వైద్యసహాయం త్వరలో అన్నిచోట్లకు అందేటట్లు ఏర్పాటుచేయాలని కోరుతున్నాను.

ఈమధ్య మా కొండజాతిప్రజలు వారి కష్టములన్నీ విశదపరచుకుంటూ తీర్మానాలుగూడాచేసి మంత్రిగారికి పంపుతున్నారు. ఏజన్సీ ప్రాంతముఅంతయు అందుబాటుగా వైద్యసహాయము అందేటట్లుగా అక్కడక్కడ సెంటర్లు ఏర్పరచి, కొండజాతివారికి సులభంగా వైద్యసహాయము అందేటట్లు వ్యానులద్వారానో లేక జాబులద్వారానో తగు ఏర్పాట్లు చేయించవలసిన అవసరమున్నది. ఏజన్సీప్రాంతాలలోవున్న కొండజాతి వారికిగూడా యీ medical offices లో గాని, హాస్పిటల్సులోగాని, dispensaries లోగాని, పనులు యిప్పించవలెననిన్ని, వైద్యముచదువు కోటానికి preference యివ్వాలని కోరుతున్నాను. తక్కిన ప్రజలతో పాటు కాకుండా, వీలయినంతమందిని మా కొండజాతివారికి యీ హాస్పిటల్సులో ఉద్యోగాలుకూడా యిప్పించాలని కోరుతున్నాను. ప్రభుత్వం శ్రద్ధవహించి చర్యతీసుకుంటుందని ఆశిస్తున్నాను.

పెదవలస గ్రామమునకు చుట్టూ 30 గ్రామాదులు యున్నవి. అందుకుగాను పెదవలస గ్రామములో ఒక dispensary యేర్పాటు చేయించి చుట్టుగ్రామాదుల ప్రజలకు వైద్యసహాయము చేయించగలందులకు ప్రభుత్వమును కోరుతూ విరమిస్తున్నాను.

